# సాహిత్యాధ్యయనం

## వివిధ సాహిత్య ప్రక్రియల సమాలోచనం

శ్రీమతి పరిమళా సోమేశ్వర్
శ్రీ తిరుమల శేషాచార్యులు
శ్రీ పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి
డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

ప్రచురణ



రిజిష్టర్డు నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

# SAHITHYADHYAYANAM

**An approach to the study of various literary forms.**


BY: Smt. ***Parimala Someswar*** **(Novel)**
Shri ***Tirumala Seshacharyulu*** **(Drama)**
Shri ***P.S.R. Anjaneya Sastry*** **(Journalism)**
Shri ***Dr. G.V. Subrahmanyam*** **(Poetry)**





ప్రచురణ : 55

ప్రథమ ముద్రణ : ప్రతులు 2, 200

ముఖచిత్రరచన, అక్షరాలంకరణ :

శీలా వీర్రాజు

ముద్రణ :

నాగలక్ష్మి ఆర్టు ప్రింటర్సు, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :

టెక్నో ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-500 003

వెల : రు. 2-00


---


Paper used for the printing of this book was made available by the Government of India at concessional rates.

**YUVABHARATHI IS GRATEFUL**



# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరీమాళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మకశక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పన్నెండేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటే ఇతరమైన సాత్వికసాధనంలేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమసాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇది యువభారతి 55 వ ప్రచురణ. ఇంతవరకు రెండులక్షల ఏభై వేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 4,600 మందికి పైగా సాహితీమిత్రులు చేరారు. రానున్న ఉగాదినాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్యసాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వతజీవిత సభ్యత్వ పథకాలలో ఆరువందల మందికి పైగా భారతీమిత్రులుగా, యాభై మంది భారతీ భూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలో నైనా సభ్యులుగాచేరి మా 'నందిని" మాసపత్రికను ఉచితంగా పొందేఅవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. 'నందిని'లో యువభారతి కార్యకలాపాల వివరాలేకాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

2-1-1977.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

# మా మా ట

ఉత్తమ సాహిత్యాధ్యాయనానికి అనువైన అవకాశాలు కల్పిస్తేనే తప్ప సాహిత్యం సమాజాన్ని ప్రభావితం చేయలేదు. అధ్యయన విధానాంతో కూడా పాఠకులకు పరిచయం ఉండాలె. ఉబుసుపోకకు చదవడాన్ని అధ్యయనం అనరు. సాహితీ సంస్థలు, రచయితలు, ప్రచురణ కర్తలు, ప్రభుత్వం, ఉత్తమాధ్యయన శీలతను ప్రజల్లో పెంపొందించే ప్రయత్నాలకు చేయూతనివ్వాలె. ప్రజాస్వామ్య వ్యవస్థా పరిరక్షణకు ఈ ప్రయత్నాలు ఆవశ్యకములనే అభిప్రాయాన్ని ఎవ్వరూ కాదనరు.

వివిధ సాహిత్య ప్రక్రియల స్వరూప స్వభావాలతో పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో 'సాహిత్యాధ్యయన' ఉపన్యాస కార్యక్రమాన్ని రూపొందించాము అనేక సాహిత్య ప్రక్రియల్లో ఒక నాల్గింటిని– కవిత్వం, నాటకం, పత్రికలు, నవలలను గ్రహించి వాటిని గూర్చి ఆయా రంగాలలో చక్కని అభినివేశాన్ని సంపాదించిన విజ్ఞులంతో ఉపన్యాసా లిప్పించి, వాటికి వ్యాసరూపాన్ని కలిగించి 'సాహితీవాహినీ' పరంపరలో ఒక తరంగంగా అందిస్తున్నాము.

కవిత్వాన్ని గూర్చి డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారు ప్రసంగించారు. వారు మా యువభారతి గౌరవ సభ్యులు. మా ప్రచురణలకు ప్రధాన సంపాదకులు. వాగ్మిశేఖరులు ఆయన. నాటకాన్ని గూర్చి ప్రసంగించిన శ్రీ తిరుమల శేషాచార్యులు గారు అధ్యాపకులకు బోధనా పద్ధతులను అలవడజేస్తూనే 'ఆదర్శ నాట్య మండలి' సారథిగా నాటక ప్రయోగంలో మంచి ప్రమాణాల నందుకొన్న కళామూర్తులు. పత్రికలను గూర్చి ప్రసంగం చేసిన శ్రీ పి. ఎస్. ఆర్. ఆంజనేయ శాస్త్రి గారికి దాదాపు మూడు దశాబ్దాల పాత్రికేయానుభవం ఉంది. కథకులూ, కవులు కూడా. ముప్పదేండ్లుగా హైదరాబాదు నగరం నుంచి వెలువడుచున్న ప్రతి ప్రముఖ పత్రికతో ప్రత్యక్షం గానో, పరోక్షం గానో సంబంధం ఉన్న పత్రికా రచయితలు. నవలలను గూర్చి ప్రసంగించిన వారు శ్రీమతి పరిమళా సోమేశ్వర్ గారు. వృత్తి రీత్యా అధ్యాపకులు. సిటి కాలేజీలో రసాయన శాస్త్రోపన్యాసకులు. ప్రజారంజకములైన అనేక నవలలను, కథలను, వ్యాసాలను ప్రచురించి ఆధునిక సాహిత్యకులలో గణనీయమైన స్థానం కల్పించుకున్న వారు.

తమ ఉపన్యాసాలను, వ్యాసాలను 'యువభారతి'కి అందించిన ఈ మహనీయులకు మేము కృతజ్ఞతాభివందనములను సమర్పించుకుంటున్నాము.

2-1-1977

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

# నవల

శ్రీమతి జి. పరిమళా సోమేశ్వర్

ఆధునిక సాహితీ ప్రక్రియలలో నేడు బహుళ జనాదరణ పొందుతున్నవి కథలు-నవలలు. మానవ జీవితమునకు సన్నిహితంగా ఉండి, వివిధ రకాల ప్రజల జీవన విధానాలను, నిత్య జీవితంలో వా రెదుర్కొనే సంఘటనలను, సమస్యలను, భిన్న మనస్తత్వాలను, వారి భౌతిక, మానసికావసరాలను, అనుభవాలను, అనుభూతులను, ఆవేదనను, ఆశయాలను అన్నిటిని సరళమైన భాషలో సహజ సుందరమైన శైలిలో చిత్రించటానికి కథలు, నవలలు అనువైన వవటమే దీనికి కారణము. అందుకే ప్రజాబాహుళ్యానికి సన్నిహితులవటానికి యీనాడు చాలామంది రచయితలు యీ రెండు ప్రక్రియలనూ సాధనాలుగా తీసుకొంటున్నారు. వీటిని పాఠకుల కందించటానికి అనేక వార, మాస పత్రికలు, ప్రచురణ సంస్థలు పూనుకొంటున్నాయి.

ఇటు పాఠకుల నుండి లభించే ఆదరణతో, అటు ప్రచురణ కర్తల ప్రోత్సాహంతో తెలుగు రచయితలు వందలసంఖ్యలో ఉద్భవించి వేలసంఖ్యలో రచనలు చేస్తున్నారు. ముఖ్యంగా గత రెండు దశాబ్దాలుగా కథానికలు, నవలలు కోకొల్లలుగా అచ్చవుతున్నాయ్. కాని యీ రచనల ఔన్నత్యం రాసిలో ఉన్నంతగా గుణంలో లేదన్న అభిప్రాయం విమర్శక లోకంలో రోజు రోజుకీ బలపడుతోంది. ఈ అభిప్రాయం కేవలం నిరాధారమైనది కూడా కాదు.

నేటి సామాజిక వ్యవస్థ ఎంతో సంశ్లిష్టంగా ఉంది. భిన్న సంస్కృతులకు, విభిన్న రాజకీయ సిద్ధాంతాలకు, విశ్వాసాలకు, ఆచార వ్యవహారాలకు ఆలవాలమైన సామాజిక స్వరూపంలోని అస్పష్టత, అనిశ్చితత్వమే నేటి తెలుగు సాహితీ ప్రక్రియలలో కూడా ప్రతిఫలిస్తోందని కొందరి అభిప్రాయం. మానవ జీవితంలో, సమాజంలో ఎంతో వైవిధ్యం ఉంది. ఎన్నెన్నో మార్పులు జరుగు

తున్నయ్. కాని యీ మార్పులు గాని, వైవిధ్యంగాని తెలుగు సాహిత్యంలో అంత స్పష్టంగా, సమగ్రంగా చిత్రించబడటం లేదు. అలాగే దాదాపు పాతిక సంవత్సరాలతో పోల్చిచూస్తే దేశంలో వైజ్ఞానికంగా, సాంకేతికంగా ఎంతో పురోగమనము కనపడుతుంది. విద్యాలయాలు, వైద్యశాలలు, విద్యుచ్ఛక్తి సరఫరా, ఆధునిక పరికరాలు నిత్యజీవన విధానంలో ఎన్నో మార్పులను తీసుకువస్తున్నయ్. కాని యీ మార్పు, యీ ప్రగతి- తెలుగు సాహిత్యంలో ప్రతిబింబించటంలేదు. దీనికి కారణం ఏమిటి ?

నేడు పుంఖానుపుంఖాలుగా రచనలు చేస్తున్న రచయిత(త్రు)లలో చాలా మందికి తాము చిత్రించే సాహిత్యాన్ని గురించి గాని, తమ చుట్టూ ఉన్న సమాజాన్ని గురించి గాని సరియైన అవగాహన లేకపోవటమే దీనికి ముఖ్యకారణం. కేవలం అచ్చులో తమ పేరు చూసుకోవాలని, ఒకేసారి నాలుగు పత్రికలలో సీరియల్ నవలలు వ్రాసి కీర్తి కిరీటాలను ధరించాలని తాపత్రయపడటం తప్ప తాము వ్రాస్తున్నదానిలో సాహితీ విలువలుగాని, సామాజిక ప్రయోజనంగాని ఎంత మాత్రమున్నాయో తిరిగి ఆలోచించుకోగల సామర్థ్యం, వివేకం చాలామంది రచయితలకుండటం లేదు. దానికితోడు తమ రచనలు వెండి తెరపై వెలిగిపోవాలన్న వ్యామోహం యీ మధ్య రచయిత(త్రు) లలో బాగా పాతుకుపోయింది. అందుకే కాస్త అక్షరజ్ఞానం ఉన్న ప్రతి అమ్మాయి, అబ్బాయి కలం పట్టుకోవటానికి వెనకాడటం లేదు.

ఈనాడు కథలు వ్రాయటానికి యింతమంది ఉత్సాహం చూపుతున్నా, పత్రికలు, సినిమాలు ప్రోత్సాహమిస్తున్నా సాహితీ స్థాయి ఏ మాత్రం పెరగటం లేదు. ఒకరిద్దరు రచయితలు సామాజిక చైతన్యంతో, సరియైన అవగాహనతో వ్రాయగలిగినప్పటికీ వారు తమ రచనలను కొన్ని సిద్ధాంతాలను ప్రచారం చేసే 'స్లోగన్లు'గా వాడుకుంటున్నారే తప్ప కళాత్మకంగా, సహజ సుందరంగా, వాస్తవిక జీవితాన్ని చిత్రించటంలో విఫలురౌతున్నారు. సాహిత్యానికి ఒక ధ్యేయం, ఒక నిర్దిష్టమైన లక్ష్యం ఉండి తీరవలసిందే ! అందులో సందేహం లేదు. కాని కథలు, నవలలు సృజనాత్మక ప్రక్రియలు. వీటిలో జీవం, చైతన్యం తొణికిసలాడాలంటే రచయితకు ఎంతో ఆలోచనా శక్తి. సామాజికమైన అవగాహన, జీవితానుభవం, చారిత్రక పరిణామాలను అభ్యుదయ దృక్పథంతో అర్థంచేసుకునే శక్తి ఉండాలి. ఈ లక్షణాలన్నిటికీ

తోడు ఆసక్తికరమైన కథాసంవిధానంతో, నిత్య జీవితంలో ఎదురయ్యే వ్యక్తుల, సంఘటనల చిత్రీకరణతో పాఠకులలో ఆలోచనను రేకెత్తించే రచనలను, వారి మానసిక పరిధులను విస్తృతం చేసే రచనలను చెయ్యగల శక్తి రచయిత కుండాలి.

కాని యీ నాడు చాలామంది తెలుగు రచయితల రచనలలో యీ లక్షణా లేవీ కనపడటం లేదు. ఐనా కోకొల్లలుగా రచనలు చేస్తూనే ఉన్నారు. ఎందు కంటె చాలా మందికి 'రచయితకు క్వాలిఫికేషన్లేమీ ఉండనక్కర్లే'దన్న గట్టి నమ్మకం ఉంది. 'వ్రాయటం నా జన్మ హక్కు'అని రచయితలు భావించటంలో తప్పేంలేదు గాని, సమాజానికి పనికివచ్చే రచనలు చేయదల్చుకున్న రచయితకి తప్పనిసరిగా కొన్ని అర్హతలు ఉండాలి.

అందులో ముఖ్యమైనది-మొదటిది-ఇతివృత్తాన్ని ఎన్నుకునే నేర్పు, కథలో గాని నవలలోగాని రచయిత ఎన్నుకునే యితివృత్తం వాస్తవ జీవితానికి సన్నిహితంగా ఉండాలి. మనకి నిత్యజీవితంలో ఎదురయ్యే సంఘటనలు-లేదా ఎదురవటానికి సంభవమైన సంఘటనలను మాత్రమే రచయిత చిత్రించాలి. సాధారణ మానవుల జీవితాలలో ఎన్నడూ కనీ వినీ ఎరగని మలుపులను, ఎక్కడో చెదురు మదురుగా కన్పించే విషయాలను-'జనరలైజ్' చేసి, దానినొక సహజమైన విషయంగా భ్రమింపజేయటానికి రచయిత ఎన్ని తంటాలు పడ్డా పాఠకులకు అలాటి అభూత కల్పనలతో నిండిన రచనలవల్ల ప్రయోజనం ఉండదు. కనీసం రచయిత కోరుకునే 'ఆనందం' కూడా పాఠకులకు కలగదు. ఏ పాఠకుల నుద్దేశించి రచనలు చేస్తున్నారో ఆ పాఠకులు ఆయా పాత్రలతో, వారి అనుభావాలతో తమని తాము identify చేసుకోగలిగేంత వాస్తవంగా రచన చెయ్యగలిగినప్పుడు ఆ రచనకి సార్థకత ఏర్పడుతుంది.

మానవ మేధస్సుకు దేశ కాల భౌగోళిక కారణాల దృష్ట్యా కొన్ని అవధు లుండటం సహజం. రచయిత కూడా మామూలు మనిషే కనుక అతని మేధా శక్తికి, జీవితానుభవానికి కూడా కొన్ని పరిమితు లుండటంలో ఆశ్చర్యం లేదు. అందుకే ఏ రచయిత కూడా ఒక్క కథలో, ఒక్క నవలలో పూర్తిగా తను నివసించే సామాజిక జీవితం యొక్క సమగ్ర స్వరూపాన్ని అందించలేడు. అతను ఎన్నుకునే యితివృత్తము, దాని ఆధారంగా చిత్రించబడిన పాత్రలు

సమాజంలోని ఏదో ఒక భాగానికి మాత్రమే సంబంధించి ఉంటయ్. ఒక్కొక్కప్పుడు ఆ భాగం-చాలా చిన్నది కావచ్చు. ఒక్కొక్కప్పుడు దాని పరిధులు విస్తృతమైనవి కావచ్చు. కాని రచయిత సమాజంలోని ఏ భాగాన్ని గూర్చి తాను వ్రాయదల్చుకున్నాడో దానిని గురించిన పూర్తి పరిజ్ఞానాన్ని ముందుగా పొంది ఉండాలి. తనకు తెలియని విషయాలను గురించి వ్రాయబూనిన రచయిత పాఠకులను 'ఫూల్' చెయ్యటమేగాక తనని తాను 'ఫూల్' చేసుకుంటాడు.

ఉదాహరణకి ఒక మధ్యతరగతి కుటుంబంలో పుట్టిన రచయిత ఉన్నత కుటుంబాలలో జరిగే సంఘటనల ఆధారంగా రచన చేయదల్చుకుంటే-ఆ కుటుంబాలలోని వ్యక్తుల జీవన విధానము, ఆహార విహారాలు, జీవితం యెడల వారికి గల దృక్పథం, వారు సంచరించే సమాజము-వీటన్నిటిని గురించి తెలుసుకోవాలి. అలాగే అతను కార్మికులను గురించి గాని కర్షకులను గురించి గాని సమాజంలోని అట్టడుగు ప్రజలను గురించి గాని వ్రాయదల్చుకున్నప్పుడు ప్రాథమికంగా ఆయా వ్యక్తుల జీవన విధానంలో గోచరించే అంశాలను, వారి సమస్యలను వారి కోణంలో చిత్రించగల నేర్పు రచయిత కుండాలి. అప్పుడే రచయిత చెప్పదలచుకున్న విషయంతో పాఠకులు 'కన్విన్స్' అవుతారు.

చాలామంది రచయితలు యీ విషయాన్ని గ్రహించక అభాసుపాలవటం మనం తరచు చూస్తూనే ఉంటాం, రాజకీయ పరిజ్ఞానం ఏమాత్రం లేని రచయితలు ఏవో కొన్ని స్లోగన్లతో రాజకీయ విషయాలను గురించి చర్చించబోవటం, కొన్ని సిద్ధాంతాలకు మిడిమిడి జ్ఞానంతో వక్రభాష్యాలిచ్చి మేధావులుగా 'పోజు' పెట్టటం- వీటివల్ల రచయితలు 'ఫూల్స్' ఆవడమేగాక పాఠకులను పెడత్రోవలు పట్టించే ప్రమాదం కూడా ఉంది. అందుకే ఏ రచయితైనా తనకి తెలియని విషయాల జోలికి పోకుండా, తనకు తెలిసిన విషయాన్ని తనని ప్రభావితం చేసి రచనకు ప్రేరణ కల్పించిన విషయాన్ని గురించి మాత్రమే వ్రాస్తే యిటు సాహిత్యానికీ అటు సమాజానికీ కూడా కొంత మేలు చేసిన వాడవుతాడు.

రచయిత సమాజంలోని ఏ భాగాన్ని తీసుకున్నా అందులో అతనికి ప్రధానంగా రెండు రకాల వ్యక్తులు, వర్గాలు కనపడక మానవు. అందులో ఒక వర్గం పీడించే వర్గం. మరొక వర్గం పీడింపబడే వర్గం (exploiting and exploited classes). ఈ పీడించటం అనేది రాజకీయంగా కావచ్చు, ఆర్థికంగా, మానసికంగా కావచ్చు. సాంఘికంగా కావచ్చు, మానసికంగా, నైతికంగా

మేధాపరంగా—ఏరకంగానైనా కావచ్చు. నిజాయితీగల రచయిత ఎప్పుడూ పీడితుల పక్షాన ఉంటాడే తప్ప పీడకుల పక్షాన ఉండడు. మానవజాతి పరిణామం, నాగరికత, మానసిక వికాసం ఎప్పుడు ప్రారంభమైనదో ఆనాటినుండి పరస్పర విరుద్ధమైన రెండు శక్తులమధ్య ఘర్షణ కూడా ప్రారంభమయింది. ధర్మానికీ అధర్మానికీ మధ్య, బలవంతులకీ బలహీనులకీ మధ్య, మంచికీ చెడుకీ మధ్య నిరంతరం పోరాటం సాగుతూనే వస్తోంది. ఈ నిరంతర సంఘర్షణవల్లనే మానవజాతి పురోగతి, సామాజిక ప్రగతి సాధ్యమయింది. ఈ ఘర్షణ ప్రతి దేశంలో, ప్రతి కాలంలో ఏదో ఒక రూపాన సామాజిక వ్యవస్థను ప్రభావితం చేస్తూనే ఉంటుంది.

రచయిత కూడా సమాజంలోని ఒక భాగమే కనుక ఆ పోరాటంలో తానుకూడా పాల్గొనక తప్పదు. ఏదో ఒక పక్షాన్ని సమర్థించక తప్పదు కూడా. 'నేను తటస్థుడిని, నేను ఎవరి పక్షమూ వహించను' అనే రచయిత పిరికి వాడైనా అయి ఉండాలి, పారుబోతైనా (escapist) అయి ఉండాలి. కాస్తంత వివేకం, జ్ఞానం ఉన్న ఏ రచయిత కూడా తటస్థంగా ఉండడు, ఉండలేడు. వ్యాసుడి దగ్గరనుండి, వాల్మీకి నాటినుండి మన కీవిషయం స్పష్టంగా తెలిసివస్తుంది. కౌరవులకీ పాండవులకీ మధ్య జరిగిన యుద్ధంలో వ్యాసుడు పాండవుల పక్షమే వహించేడు. కౌరవులు బలవంతులు. కుత్సితులు. పాండవులు జూదంలో రాజ్యాన్నీ, భార్యనికూడా పోగొట్టుకున్న బలహీనులు, నిస్సహాయులు. వ్యాసుడు తన సానుభూతి, ప్రేమ, కొన్ని బలహీనతలున్నప్పటికీ-పాండవులమీదనే చూపించేడు తప్ప కౌరవులమీద చూపించలేదు. అలాగే వాల్మీకి తండ్రి యానతికోసం రాజ్యాన్ని వదులుకున్న రాముడిని, రాచరిక వ్యవస్థకు లోబడి భర్తనుండి విడిపోయి అనేక కష్టాలకు గురియైన సీత కన్నీటి కథను ప్రజల హృదయాలలో నిల్చిపోయేటా చిత్రించేడు తప్ప రావణుడిని, శూర్పణఖని, తాటకిని 'గ్లోరిఫై' చెయ్యలేదు. బలవంతులలోని సుగుణాలను మెచ్చుకునే కన్న బలహీనులు, నిస్సహాయులు అయిన వారిలోని లోపాలను ప్రేమించటమే ఉత్తమ రచయిత లక్షణం. బలహీనులకి న్యాయం చేకూర్చటానికి, దుఃఖజీవుల కన్నీటిని తుడవటానికి కలం పట్టుకున్నవాడే పాఠకుల హృదయాల్లో చిరస్థాయిగా నిల్చి పోయే రచనలను చేయగల్గుతాడు.

ప్రబంధయుగంలో రాచరిక వ్యవస్థలోని సౌందర్యానుభూతులను గురించి, శృంగారానుభవాలను గురించి ఎన్నో రచనలు వెలువడినయ్, మహా ప్రతిభా వంతులైన పండితులు కూడా తమ సృజనాత్మక శక్తిని, పాండితీ ప్రకర్షను కేవలం తాము ఎవరి ప్రాపుకోసం ప్రాకులాడుతున్నారో వారి అభిరుచుల కను గుణంగా వినియోగించి రచనలు చేసేరు తప్ప అధిక సంఖ్యాకులైన ప్రజల జీవన విధానాలను, వారి అనుభవాలను చిత్రించటానికి ప్రయత్నించలేదు. అందుకే సాహితీపరంగా, పాండిత్య పరంగా ఎంత గొప్పవయినప్పటికీ అవి భారత రామాయణాలవలె సజీవంగా, నిత్యనూతనంగా యీ నాటికీ మామూలు ప్రజల నలరించలేక పోతున్నయ్.

భారతంలో, రామాయణంలో రాజులకథలే యితివృత్తంగా తీసుకోబడి నప్పటికీ, పాండవులు, సీతారాములు కూడా మామూలు మనుషులవలె సామాన్య పౌరులవలె అనేక కష్టనష్టాలకు గురియైనట్లు చిత్రించబడటంవల్ల పాఠకులు ఆయా పాత్రలతో తమని తాము identify చేసుకుని మెచ్చుకోవటం జరిగింది. ఈ విషయాన్ని నేటి రచయితలందరు కూడా దృష్టిలో ఉంచుకోవటం అవసరం. ప్రజలు ఏయే పాత్రలలో, సంఘటనలలో తమ నిత్య జీవిత విధానాన్ని చూడ గలుగుతారో ఆ రకమైన పాత్రలు, సంఘటనలు గల రచనలు మాత్రమే చిర కాలం ప్రజల హృదయాల్లో సజీవంగా నిల్చిపోగలవు.

పాఠకుల హృదయాలకు సన్నిహితంగా కొనిపోయే పాత్రలను సృష్టిం చాలంటే రచయిత గొప్ప మనస్తత్వ శాస్త్రజ్ఞుడై ఉండాలి. మానవ నైజాన్ని, దేశకాల సామాజిక పరిస్థితులనుబట్టి మానవ స్వభావంలో కనపడే వైవిధ్యాన్ని అర్థం చేసుకుని దానిని నేర్పుగా చిత్రించాలి రచయిత. అనగా కథలలో నవల లలో 'human element' ఎంత ఎక్కువగా ఉంటే ఆ రచన అంత ఎక్కువ కాలం నిలుస్తుంది. రచయిత ఏ ఆశయ సిద్ధికోసం రచన చేసినప్పటికీ ఆ ఆశ యాన్ని కేవలం స్లోగన్ రూపంలో కాక వివిధ సంఘటనల కూర్పులో, విభిన్న మనస్తత్వాల చిత్రీకరణలో అంతర్లీనంగా ఉండి పాఠకుల మనసులలో ముద్ర వేసుకునేలా రచయిత నేర్పుగా వ్రాయగలగాలి.

నేటి తెలుగు సాహిత్యాన్ని నిశితంగా పరిశీలించి చూసినట్లయితే ఒక విషయం స్పష్టంగా కనపడుతూంది. అదేమంటే తెలుగు రచయితలు ఎంత

గొప్పవారైనా, కథలోని మలుపులకు, శిల్పానికి, సందేశానికి యిచ్చినంత ప్రాముఖ్యతను పాత్ర చిత్రీకరణకి యివ్వటం లేదని. పాత్రలు కేవలం కథని నడిపే సాధనాలుగా ఉపయోగపడుతున్నాయే తప్ప విశిష్టమైన వ్యక్తిత్వంతో, విలక్షణమైన ప్రవర్తనతో ప్రజల హృదయాల్లో మరపురాని ముద్రవేసే పాత్రలు తెలుగు సాహిత్యంలో మనకి చాలా అరుదుగా కనపడతయ్. శ్రీరామచంద్రుడు, సత్య హరిశ్చంద్రుడు, ధర్మరాజు, శకుని, శూర్పణఖ, ఉత్తరకుమారుడు, శాటన్, ఒథెల్లో, దేవదాసు, గిరీశం మొదలైన పాత్రలను యీనాటికీ మనం 'సింబాలిక్'గా వాడుకుంటున్నామంటే ఆయా పాత్రల వ్యక్తిత్వాన్ని రూపొందించటంలో రచయితలు ఎంతగా కృషి చేసేరో అర్థమవుతుంది. ఇంతకు మునుపే చెప్పినట్లు అలాటి పాత్రలను చిత్రించాలంటే రచయిత గొప్ప మనస్తత్వవేత్త అయి ఉండాలి. మానవ స్వభావాన్ని, మానవుని అంతరంగపు లోతులలో కదలాడే భావతరంగాలని ఆకళింపు చేసుకుని వాటిని ప్రతిభావంతంగా ప్రకటించగల భావనాశక్తి, భాష రచయిత కున్నపుడే అలాటి పాత్రలను సృష్టించ గలుగుతాడు.

రచయిత మనస్తత్వవేత్తయే గాక తత్వవేత్త కూడా అయి ఉండాలి. జీవితాన్ని, సామాజిక పరిణామాలని తాత్వికదృష్టితో చూసి అర్థం చేసుకోగల రచయితే యితరులకు సందేశాన్నందించే స్థాయిగల రచనలను చేయగల్గుతాడు.

రచయిత కేవలం తాత్వికుడు మాత్రమే అయితే అతని రచనలలో 'ఆర్ద్రత' ఉండదు. రసస్ఫూర్తి ఉండదు. రచయిత వేదాంతియే కాక భావుకుడు, సౌందర్యోపాసకుడు అయి ఉండాలి. అప్పుడే తన 'ఫిలాసఫీని' లేదా దృక్పథాన్ని అందంగా, ఆకర్షణీయంగా ప్రకటించగలుగుతాడు. కేవలం భావుకత, సౌందర్యోపాసన మాత్రమే గల రచయితలు కాల్పనిక సాహిత్యాన్ని, కృత్రిమమైన ఆనందాన్ని, అనుభూతులను అందిస్తారు తప్ప వాస్తవ జీవితాన్ని, సజీవమైన పాత్రలను చిత్రించలేరు.

అందుకే రచయితకు భావుకతతో పాటు జీవితాన్ని వాస్తవిక దృక్పథంతో చూసి విశ్లేషించగల ప్రతిభ కూడా అవసరం. కేవలం సమాజ స్థితిగతులను, వ్యక్తుల మనస్తత్వాన్ని యథాతథంగా చిత్రీకరించే రచయిత గాని, అటు కేవలం కృత్రిమ వాతావరణాన్ని, కాల్పనికజగత్తును సృష్టించే రచయిత గాని సామాజిక

ప్రయోజనం గల రచనలను చేయలేరు. వాస్తవ జీవితాన్ని విశ్లేషణాత్మకంగా చిత్రిస్తూ సమాజంలోని అసమానతలను, మంచి చెడులను, వైరుధ్యాన్ని చారిత్రక దృష్టితో అవగాహన చేసుకొని శాస్త్రీయదృక్పథంతో సమాజప్రగతికి దోహదం చేసే పరిష్కార మార్గాలను సూచించగల 'మేధావి' అయిఉండాలి రచయిత.

రచయిత మామూలు మనిషే, రచనలు చేయటానికి అతనేం మేధావి కానక్కర్లేదు అని కొందరి అభిప్రాయం. కాని ఆ అభిప్రాయం సరియైనది కాదు. రాజకీయాల్లో గాని, వైజ్ఞానిక రంగంలో గాని, సాహితీ రంగంలో గాని ఎందులోనైనా నిష్ణాతులైన వారు మామూలు మనుషుల కన్న ఎక్కువ తెలివితేటలు మేధాశక్తి గలవారేనని తెలుస్తోంది. ఒక రచయిత యొక్క మేధాశక్తిని అతను వర్తమాన సమాజాన్ని అవగాహన చేసుకొనే పద్ధతిని బట్టి, ముందు తరాలవారి అవసరాలని గుర్తించే 'ముందు చూపు'ని బట్టి అంచనా వేయవచ్చును.

ఐతే రచయిత కేవలం మేధావి అయినంత మాత్రాన కూడా సరిపోదు. ముఖ్యంగా మనదేశంలో మేధావులైన రచయితలలో చాలామంది సమకాలీన సమాజంలోని లోపాలను చూసి ఆవేదన చెంది ఆ లోపాలని రూపుమాపాలంటే తిరిగి ప్రాచీన భారతీయ సంస్కృతిని, సంప్రదాయాలను పునరుద్ధరించటమే పరిష్కార మార్గం అని భావించిన వాళ్లున్నారు. అలాటి రచయితలందరూ తమ ప్రతిభా విశేషాలను, సృజనాత్మక శక్తిని, వైదుష్యాన్ని అన్నిటినీ ప్రాచీన సంప్రదాయాన్ని కీర్తించటంతోనే వినియోగించేరు తప్ప సమాజంలోని పరిణామాలను చారిత్రక దృష్టిలో అర్థం చేసుకుని ఆ సమాజానికి, కాలానికి తగినటువంటి పరిష్కార మార్గాలను సూచించటానికి ప్రయత్నించలేదు. రవీంద్రనాథ టాగోర్, విశ్వనాథ సత్యనారాయణ యీ కోవకు చెందిన రచయితలు. 'సంస్కృతి' 'సంప్రదాయాలు' అన్నవి స్థిరమైనవి (static) కావనీ, ఆయా సమాజాన్ని ఏలుతున్న రాజకీయ సిద్ధాంతాలను బట్టి, ఆర్థిక విధానాలను బట్టి సమాజం యొక్క సంస్కృతి కూడా మారుతుందనీ వాళ్లు గ్రహించలేకపోయేరు. మనం 'సంస్కృతి' అని దేని నంటున్నామో అది 'ఫ్యూడల్ సంస్కృతి'. రాచరిక వ్యవస్థకు అనువైన సంస్కృతి. ప్రజాస్వామ్య వ్యవస్థలో నివసిస్తూ, ప్రజాస్వామిక విధానాల వల్ల లభించే privileges ని అన్నిటినీ అనుభవిస్తూ రాచరికపు సంస్కృతిని కోరుకోవటంలో అర్థం లేదు. వ్యవస్థతో పాటు సంస్కృతి కూడా మారుతుంది. మారాలి. ఇలా మారుతున్న సంస్కృతిలోని మంచి చెడులను గుర్తించి కాలాను

గుణంగా ఏది మంచో, ఏది చెడో నిర్ణయించగల శక్తి రచయిత కుండాలి. ఒక్క మాటలో చెప్పాలంటే రచయిత ఎప్పుడూ సంప్రదాయ వాది కాకూడదు. విప్లవకారుడై యుండాలి. సంప్రదాయాన్ని స్తుతించే కవులకు అవార్డులు రావచ్చును. పదవులు రావచ్చును. కాని వారి రచనలు ముందుతరాల ప్రజలను మాత్రం ప్రభావితం చెయ్యలేవు. సంప్రదాయ కవుల గ్రంథాలు లైబ్రరీలలోని అలమరలను అలంకరిస్తే విప్లవ రచనలు ప్రజాహృదయాల్లో నిల్చిపోతయ్.

ఐతే 'విప్లవం' అనే పదానికి చాలామంది విపరీతార్థాలను తీయటం జరుగుతోంది. హింసాత్మక చర్యలను ప్రోత్సహించే వాడే విప్లవకారుడన్న దురభిప్రాయం కొందరికుంది. సమాజంలోని బలహీనులు, పీడితులు, తాడితులు ఏ వ్యవస్థ వల్ల అన్యాయాలకు, అక్రమాలకు గురియౌతున్నారో ఆ వ్యవస్థ నేలే ప్రాథమిక సూత్రాలలో 'మార్పు' రావాలని ఆశించే వాడే విప్లవకారుడు. విశ్వనాథ సత్యనారాయణ గొప్ప విద్వాంసుడు, మేధావి, భావుకుడు. కాని విప్లవకారుడు కాడు. అందుకే ఆయన ఆస్థానకవి కాగలిగాడు గాని యువకవుల హృదయాలలో స్థానాన్ని ఏర్పరచుకోలేక పోయేడు. తెలుగు సాహితీ ప్రపంచంలో యుగకర్తలుగా భావించబడే కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, శ్రీశ్రీ తమ రచనల ద్వారా, తమ విప్లవాత్మక భావాల ద్వారా ముందు తరాల రచయితలకు మార్గదర్శకులు కాగలిగారు.

ఏ సమాజంలోనైనా మంచి, చెడు రెండూ ఉంటయ్. చెడును అదేపనిగా నిరసించే కన్న మంచిని మెచ్చుకోవటం 'మంచిది' కదా అని కొందరంటారు. నిజమే. ఏ వ్యవస్థ కూడా లోపరహితంగా, భూతల స్వర్గంలా ప్రజలందరికీ సమానమైన న్యాయాన్ని కలిగిస్తుందని అనలేము. అప్పటి పరిస్థితుల దృష్ట్యా, ఆయా దేశ కాల భౌగోళిక మత ప్రభావాలను బట్టి అమలులో ఉన్న వ్యవస్థ కన్న ఉన్నతమైన, సుఖప్రదమైన వ్యవస్థ రావాలని ప్రతి రచయితా కోరుకుంటాడు. అమలులో ఉన్న వ్యవస్థతో పూర్తిగా రాజీపడేవాడు ఎప్పుడూ గొప్ప రచయిత కాలేడు. అసలు 'రాజీ' అన్నది రచయిత స్వభావానికే విరుద్ధం. మార్క్స్, మహాత్మా, రస్సెల్, శ్రీశ్రీ తమ కాలం నాటి వ్యవస్థతో రాజీపడి ఉంటే వారు యుగకర్తలు అయిఉండే వారు కారు. కోట్లాది ప్రజలను ప్రభావితులను చేయగలిగి వుండేవారు కారు. సమాజంలోని 'మంచి'తో తృప్తిపడే రచయితలు మంచి రచనలను చేయగలరేమో కాని, సమాజంలోని 'చెడు'ను ప్రతిఘటించే

రచయితలు 'గొప్ప' రచనలను చేస్తారు. తమ వెంట వందలాది ప్రజలను నడిపిస్తారు. 'కదిలే వాడు, కదిలించే వాడే' కవి. ఏ వ్యవస్థ అయినా కొంత కాలం కొనసాగిన తరువాత 'డైనమిజమ్'ని కోల్పోయి static గా తయారవుతుంది. అందుకే క్రాంత దర్శకుడైన రచయిత ఎప్పుడూ 'మార్పు'ను ఆశిస్తాడు. సమాజము చలన శీలమే కాదు, ప్రగతి శీలము కూడా నని గ్రహించి తన రచనల ద్వారా ఆ ప్రగతికి దోహదం చేయటానికి ప్రయత్నిస్తాడు. నీటి ప్రవాహాన్ని మళ్లించవచ్చు; గాలిని బంధించవచ్చునేమో గాని కాలానికి కళ్లెం వేయటం ఎవరికీ సాధ్యం కాదన్న సత్యాన్ని రచయిత గుర్తించగలిగినప్పుడే సమకాలిక సమాజానికి, ముందు తరాల వారికి కూడా పనికి వచ్చే సాహిత్యాన్ని సృష్టించగలుగుతాడు.

కేవలం రచనల వల్ల సమాజం మారుతుందా అన్న సందేహం కొందరికి వస్తుంది. నిజమే. ఒక రచయిత కేవలం తన రచనల వల్ల సామాజిక వ్యవస్థను మార్చలేడు. సామాజిక స్వరూపాన్ని ఒక్క రోజులో మార్చగల శక్తి అధికారంలో ఉన్న వర్గానికి, చట్టానికి ఉన్నంతగా రచయితకుండదు. కాని స్వయంగా తాను మార్చలేక పోయినప్పటికీ మార్పుకు దోహదం చేసే రచనలను చేయటం, జరుగుతున్న మార్పుల కనుగుణంగా ప్రజలను మానసికంగా సంసిద్ధులను చేయటం రచయితల కసాధ్యమేమీ కాదు.

ఇక్కడ మరొక విషయం కూడా ప్రస్తుతించవలసి ఉంది. ఒక రచన యొక్క ప్రమాణాలను నిర్ణయించటం ఎలా? సార్వకాలికము, విశ్వ జనీనము అయిన సాహిత్యం అనేది ఉంటుందా? కేవలం నేటి ప్రమాణాలతో ప్రాచీన సాహిత్యాన్ని విమర్శించి పరిహసించటం ఉచితమా? ఎంత గొప్ప సాహిత్యానికైనా చారిత్రిక, భౌగోళిక పరిధులనేవి ఉంటాయన్నసంగతిని మనం విస్మరించరాదు. కొందరు కవులు వర్తమాన పరిస్థితుల నర్థం చేసుకోలేక తిరోగమన వాదంతో ప్రజలను మూఢులను చేయటానికి ప్రయత్నించినట్లే నేడు కొందరు రచయితలు కొన్ని వేల సంవత్సరాల నాటి సాహిత్యాన్ని నేటి ప్రమాణాలతో చూసి విమర్శించి పాఠకులను పెడత్రోవలు పట్టిస్తున్నారు. రామాయణాన్ని నిన్న మొన్న పారిశ్రామిక విప్లవానంతరం కాపిటలిస్టు వ్యవస్థకు వ్యతిరేకంగా రూపొందింపబడిన మార్క్సిస్టు దృక్పథంతో చూసి విమర్శిస్తున్న మిడి మిడి జ్ఞానపు మేధావులు తెలుగు సాహితీ ప్రపంచంలో యిప్పుడిప్పుడే బయల్దేరుతున్నారు.

రామాయణం ఏ కాలంలో రచింపబడింది? ఏ ఉద్దేశ్యంతో రచింపబడింది? ఆనాటి రాజకీయ సిద్ధాంతా లేమిటి? సామాజిక వ్యవస్థ ఎలాటిది? ఇవేవీ ఆలోచించకుండా రాముడు వెధవనీ, సీత చవట అనీ తేలికగా మాట్లాడటం, పైగా దానికి 'మార్క్సిస్టు దృక్పథం' అన్న పెద్ద పేరును తగిలించటం ఆయా విమర్శకుల అజ్ఞానాన్ని మాత్రమే చాటుతుంది. వాల్మీకి రామాయణం తరువాత ఎన్నో ప్రక్షిప్తాలు వచ్చినయ్. మూలకథ ఒకటే అయినా కాలానుగుణంగా పాత్ర చిత్రీకరణలో, కథాసంవిధానంలో చాలామార్పులు జరిగినయ్. ఏ కథ వ్రాస్తున్నా ఏనాటి కథ వ్రాస్తున్నా రచయిత తన సమకాలిక ప్రభావం నుండి తప్పించుకోలేడు. వాల్మీకి కాలంలో అ స్తవ్య స్తంగా ఉన్న కుటుంబ వ్యవస్థను పటిష్టం చెయ్యటానికి సమాజ ప్రగతికి బలమైన కుటుంబ వ్యవస్థ, భార్యాభర్తల అనుబంధం అవసరమన్న సందేశాన్ని అందించటానికి రామాయణం రచింపబడింది. రాచరికపు వ్యవస్థలో రాజే దేవుడు. ప్రజలలో ఒక ఆదర్శాన్ని, నీతిని ప్రచారం చేయాలంటే దానికి ముందు రాజు ఆదర్శప్రాయుడు కావాలి. అందుకే ఏకపత్నీ వ్రతుడైన శ్రీరామచంద్రుని పాత్ర సృష్టింపబడింది.

రాజు తలచుకుంటే భార్యలకు కొదువ లేదు. కాని శ్రీరామచంద్రుడు ఒకే భార్యపై మనసును లగ్నం చేసేడు. ఆనాటి సంప్రదాయం ప్రకారం తండ్రి యానతి శిరసావహించి అడవుల పాలయ్యేడు. (ఔరంగజేబులా సోదరులను చంపి, తండ్రిని కారాగారంలో బంధించి సింహాసనాన్ని అధిరోహించలేదు.) భార్యను పోగొట్టుకొని మామూలు పౌరుడిలా చెట్టునీ పుట్టనీ పట్టుకుని విలపించేడు. రాజు హోదాలోనే-కాదు కనీసం మామూలు మగవాడిలాగా రెండో పెళ్ళి చేసుకోలేదు. కట్టుకున్న భార్యకోసం వేచియున్నాడు. తన అర్ధాంగిని అగ్నిపరీక్షకు పెట్టి రాజుగా తన ధర్మాన్ని నెరవేర్చేడు. ఇదంతా ఎందుకు చేయవలసి వచ్చింది? రాజే దైవంగా, రాజాజ్ఞే దైవాజ్ఞగా భావించబడే వ్యవస్థలోకూడా రాజైన రాముడు భార్యకోసం, ధర్మంకోసం అన్ని బాధలు పడ్డాడు కాబట్టే ఆదర్శపురుషుడైనాడు.

చిత్రమైన విషయ మేమంటే కొన్ని వేల సంవత్సరాలు గడచినా, ఏకభార్యాత్వం చట్టబద్ధం చేయబడిన ప్రజాస్వామ్యవ్యవస్థలోకూడా భార్యమీద అంత ఏకాగ్రతతో మనసును లగ్నంచేసే పురుషులు అరుదైన యీనాటికీ శ్రీరామచంద్రుడే ఆదర్శప్రాయుడైన పురుషుడిగా భావించబడవలసి ఉంటుంది. అలాటి పాత్రలను demolishచేసి, బోడిగుండుకీ మోకాలిచిప్పకీ ముడిపెట్టినట్లు వాల్మీకి

రామాయణానికి మార్క్సిస్టు దృక్పథాన్ని జోడించి, తెలిసీ తెలియని పాఠకుల హృదయాల్లో విషబీజాలను నాటే 'విషవృక్షాల'ను గురించి ఏమనుకోవాలి ? దీని కంతటికీ కారణం రచయితలో చారిత్రిక దృక్పథం లేకపోవటమే ! సమాజాన్ని చారిత్రక, గతితార్కిక భౌతికదృష్టితో విశ్లేషించి చూడాలన్న మార్క్సుయొక్క మూలసూత్రానికి విరుద్ధంగా విషవృక్షాన్ని సృష్టించిన రంగనాయకమ్మ తను రామాయణాన్ని మార్క్సిస్టు దృక్పథంతో తిరిగి వ్రాసేనని మురిసిపోతుంటే నవ్వుకోవటం తప్ప మరోమార్గం లేదు. చరిత్ర గతిని వెనక్కి తిప్పాలనిచూసే మేధావుల రచనలవల్ల ఎంత ప్రమాదం ఉందో సాహిత్యానికి వక్రభాష్యాలుచెప్పే మిడిమిడిజ్ఞానపు విప్లవనినాదాలవల్ల కూడా అంతకన్న రెట్టింపు ప్రమాదం ఉంది.

అందుకే యువరచయిత లందరూ ముఖ్యంగా గమనించవలసిన విషయ మేమంటే, తాము ఎన్నుకొనే యితివృత్తానికిగల దేశ కాల అవధులను గురించిన పరిజ్ఞానాన్ని ముందు పొందాలి. చంచలమైన మానవహృదయాన్ని 'డిసిప్లిన్డు' గా ఉంచటానికి ఒక ధర్మం, చట్టం అవసరం. ఆ ధర్మం, చట్టం కాలానుగుణంగా మారుతూండవచ్చు. కాని దాని లక్ష్యం ఒకటే ! సమాజ శ్రేయస్సు.

తన సమాజానికి, తన కాలానికి ఏది శ్రేయోదాయకమో, ఏది ఆదర్శ ప్రాయమూ అనుసరణయోగ్యమో ఆ ధర్మాన్ని ప్రబోధించే రచనలు చేయటానికి రచయితలో ఎంతో జీవితానుభవం, చారిత్రకదృక్పథం, వ్యక్తిగతమైన దురభి ప్రాయాలకు తావులేని వర్గపక్షపాతం, బలహీనులయెడల, నిస్సహాయులపట్ల జాలి, కరుణ, మనస్తత్వ పరిశీలనాశక్తి, తాత్వికత, భావుకత మొదలైన లక్షణాలన్నీ తగుపాళ్ళలో ఉండాలి. అప్పుడే ఆ రచయిత కలం నుండి వెలువడిన రచనలు సమాజశ్రేయస్సుకు దోహదం చేయగలవు.

—: o :—

# దృశ్యకావ్యములు

శ్రీ తిరుమల శేషాచార్యులు

## శ్రవ్యకావ్యములు, దృశ్యకావ్యములు :

"ప్రయోజన మనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే" అను ఆర్యోక్తి ప్రకారము, ఏ బుద్ధిమాంద్యుడుకూడ ప్రయోజనాన్ని ఉద్దేశించకుండ, కార్యమునకు పూనుకొనడు. అట్టి యెడ ప్రయోజనోద్దేశ్యము లేకయే మహాకవులు కావ్యరచనమున కేల పూనుకొందురు? కావుననే కావ్యప్రకాశకారుడు, "కావ్యం యశసేఽర్థకృతే, వ్యవహారవిదే, శివేతరక్షతయే, సద్యఃపర నిర్వృతయే, కాంతాసమ్మితతయోపదేశయుజే" అని నిర్వచించినాడు. కావ్యము యశము కొఱకో, ధనసంపాదన నిమిత్తమో, వ్యవహారజ్ఞానము నార్జించుటకో, అశుభములను వర్జించుటకో, పరలోకసుఖముల కొఱకో రచింపబడవలెనని, అదియును ప్రియునకు తన ప్రియురా లుపదేశించునట్లు మధురాతిమధురము కావలెనని.

ఇక ఆధునికులు ఎట్లు ఊహింతురో గమనింతము. ప్రతివ్యక్తికి శరీరము, మనస్సు రెండు ఉన్నవి. శరీరపోషణమునకు అన్నపానాదులు నిద్రావిహారాదులు అవసరము. అట్లే మనస్సును పోషించుటకు ఆనందసుఖములు అవసరము. షడ్రసోపేత భోజనము, కమ్మని పానీయములు, సుఖనిద్ర, వాహ్యాళి మున్నగునవి దేహారోగ్యమును కూర్చును. కావ్యశ్రవణము, వినోదదర్శనము, ప్రియాలాపములు మనస్సు నారోగ్యపరచును. పాశ్చాత్యులు, "Sound mind in a sound body" అనినారు. కాని ప్రాచీనులు దీని నంగీకరించినట్లు తోపదు. వాల్మీక్యాది ఋషులు అన్నపానాదులకు రోసి, కేవలము వాయుభక్షణులై, తపస్సు చేసినారు. వారిపై పుట్టలు పెరిగినవి. దేహ మేమయినట్లు? వారట్లు ఆలోచనా సముద్రమును మథనము చేసి, ఆరోగ్యవంతమైన మనస్సును మథించి, కావ్యసుధను వెలువరించి పంచినారు. కావున కావ్యాదులు మానసికానందమును కూర్చుననుటలోను, అనుభవజ్ఞుల మనస్సుల నారోగ్యము పెంచుననుటలోను,

విప్రతిపత్తి లేదు. ఇప్పుడు కావ్యమనిన, ''ఏది మనస్సున కానందసుఖముల నిచ్చి, ఆరోగ్యమును పెంచునో, తద్ద్వార యిహపరసుఖముల నిచ్చునో అది.'' కావుననే కావ్యము పురుషార్థసాధకమైనది.

## శ్రవ్య కావ్యములు

వేదములు శ్రుతులు విని నేర్చుకొనవలసినవి. శ్రవ్యములు అనగా విని యానందింపదగినవి. శ్రవ్య కావ్యములనగా కేవలము శ్రవణానందములై, మనస్సుల కాహ్లాదమును గూర్చునవి. రామాయణ భారత భాగవతాదులు మనువసు చరిత్రాదులు మున్నగునవి.

## దృశ్యకావ్యములు

దృశ్యములు అనగా చూడదగినవి. దృశ్యకావ్యములనగా చూచి యానందింప దగిన కావ్యములు. రూపకములు, నాటకములు మున్నగునవి. "సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్," ఇంద్రియములన్నింటిలో కన్నులు ముఖ్యమైనవి. కన్నులుండుటచేతనే ఈశ్వర సృష్టిని చూచి, తనిసి, ఆతని పరత్వ స్థిరత్వములను విశ్వసించుచున్నాము. చూచినది సత్యము. విన్నది సత్యము కాకపోవచ్చును. గాయకుని పాటను (సంగీతమును) రేడియో ద్వారా వినినప్పుడు, మనము ఆనందానుభూతులను పొందుచునే యున్నాము. అయినను పాట కచేరీలలో వారిని (ఆ గాయకుని) చూచుచు ఆ పాట వినినప్పటి యానందము వేరు. ఇంకను చెప్పవలెననిన, గాయకుని మూతి మువ్వంకలై, జుగుప్సాకరముగ నుండును. అయినను ఆనందమున కడ్డుకాక పరవశింపజేయును. ఇది దృశ్య మాహాత్మ్యము. కావుననే దృశ్యకావ్యములు శ్రవ్యకావ్యములకంటెను రసానుభూతిని కలిగించుటలో ప్రముఖములని పండితాభిప్రాయము. భరతుడు నాట్యశాస్త్రమున నాట్యోత్పత్తికి హేతువును చెప్పుచు, ఒక్కొక్క మన్వంతరమున, కృతత్రేతాయుగముల సంధికాలమున, ప్రజలు కామక్రోధాది అరిషడ్వర్గములకు లోనై, గ్రామ్యధర్మ ప్రవృత్తి నవలంబింతురనియు, అనగా అజ్ఞానులై చరింతురు, వారికి శ్రుతి యితిహాస పురాణములు చెవికెక్కవు. వారిని సన్మార్గగాములగా నొనర్చుటకు దేవేంద్రుడు బ్రహ్మదేవునిట్లు ప్రార్థించినాడు: "ఓ బ్రహ్మదేవుడా! "క్రీడ నీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచయద్భవేత్" అనగా, "చూచుటకును, వినుటకును, అనువైన వినోద వస్తువును మేము కోరుచున్నాము. అనుగ్రహించుము" అని.

"కావ్యేషునాటకం రమ్యమ్." కావ్యములలో, అనగా శ్రవ్యదృశ్య కావ్యములలో నాటకమే రమ్యమైనది. దృశ్యకావ్యమే రమణీయము. అనియు, "నాటకాంతంహి సాహిత్యమ్" అన్న మరియొక విశేషసూక్తియు నున్నది. విశ్వవిద్యాలయ పట్టములలో P.H D. డాక్టరేటు పట్టము ఎట్లు పైమెట్టో, అట్లే సాహిత్యమునకు చివరిమెట్టు, అత్యున్నత స్థానము నాటకము. (దృశ్యకావ్య పఠనము).

సాహిత్యవృక్షమునకు అక్షరాభ్యాసము బీజము. ఇతర సాహిత్య ప్రక్రియలు వేర్లు, బోదె, ఆకులు, కొమ్మలు, రెమ్మలు మొగ్గలు పూవులు మున్నగునవి. నాటకములు ఫలములు. ఫలాపేక్ష చేతనే కదా బీజ నిక్షిప్తము? ప్రయోజన సిద్ధియేకదా ఫలము. ఏ ఫలము నాశించి మానవుడు సాహిత్య వ్యాసంగమును సలుపునో అది నాటకము-(దృశ్యకావ్యము)

## పూర్వాంధ్రకవులు నాటకముల నేల రచింపరైరి?

నాటక ప్రయోజన మింతగొప్పదిగా నున్నప్పుడు, నన్నయ తిక్కనాదులు తద్రచనమునకేల పూనుకొనరైరి? చేతగాకనా? ఇష్టములేకనా? ''అతి సమర్థుల కిల నసాధ్యంబు గలదె?" నన్నయ తిక్కనాదులకు చేతగాదన్న వాదము నిరాధారము. ఇష్టము కాలేదన్న వాదమునే సమాశ్రయింతము. విద్వాంసు లనేకు లనేక కారణములను చెప్పుచున్నారు. నేనూహించిన కొన్నింటి నిందు పొందుపరతును. ఆదికవి వాల్మీకి, సాక్షాద్విష్ణ్వంశ సంభూతుడైన వ్యాసుడు మున్నగువారు వేద ప్రచారమును ఇతిహాస రూపమున చేసినారు. "వేదః ప్రాచేత సాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా" అనియు, నన్నయ, "వివిధ వేదతత్త్వ వేది వేద వ్యాసుడు- విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు" అనియు తిక్కన, "భారతమను పేరబరగు పంచమ వేదం బారాధ్యము" అనియు వేద ప్రచార సాధనములు గనె భారత భాగవత రామాయణాదుల నుపయోగించుట స్పష్టము. నన్నయ తిక్కనాది పూర్వాంధ్ర కవులును వైదిక ధర్మ ప్రచారము కొఱకే రచనలు చేసినారు. అట్లగుట వారు పూర్వఋషిమార్గమునే యనుసరించి యుందురు. ముఖ్యముగ తిక్కన గారు ఉత్తర రామాయణమును నిర్వచనముగ వ్రాయుటలోని ఆంతర్య మిదియేనేమో? శ్రవ్య కావ్యముల కంటెను దృశ్య కావ్యములు ప్రభావితములే. కాని అవి ప్రదర్శింపబడి నప్పుడే అధిక ప్రయోజన

కారులు. ప్రదర్శింపబడ వలెననిన, సామాన్య మానవుడు రామాది పాత్ర ధారణము చేసి, తాను రాముడే నని సామాజికుల నమ్మించ గలుగవలెను. అనగా మోసగింపవలెను. ఇట్టి కృత్రిమ ప్రదర్శనము పరమ నిష్ఠాగరిష్ఠులైన పెద్దల కిష్టమైయుండదు. అంతేకాదు-కథను రంగస్థల యోగ్యముగను, ప్రదర్శనాను కూలముగను మలచవలెను. అట్లు సేయుట అసత్యమే కదా? అట్టి అసత్య దోషమునకు వారు సాహసించి యుండరు. ఒక్క భరతముని తక్క ఋషు లెవ్వరును నాటకములు వ్రాసినట్లు తోపదు. భరతుని నాట్యశాస్త్రమున నాటక లక్షణములే తక్క ఆతని కృతమైన నాటకము కూడ అలభ్యమే. మూడవది, ద్విజుడు రామాది పాత్రధారణము చేసి నాటకము ప్రదర్శింపరాదనియు, అట్లు చేసినవాడు పంక్తి బాహ్యుడగుననియు, వాని దర్శన మాత్రమున శవ దర్శనము వలె సచేల స్నానము చేయవలెననియు నేర్పడిన యాచారములు నిన్న మొన్నటి వరకు సమాజమున పాటింపబడుచు వచ్చినవి. కావుననే కావలెను మన పిల్లలమఱ్ఱి పిన వీరన, తననుఱ్ఱూతలూగించిన అభిజ్ఞాన శాకుంతలమును యథాతథముగ (దృశ్య కావ్యముగ) ననువదింపక, శ్రవ్య ప్రబంధముగ నుద్ధరించి తన మక్కువ దీర్చి కొనినాడు.

భారత కవులకును ప్రబంధ కవులకును దృశ్య కావ్యములపై నభిరుచి యెక్కువే యనుటకు తగినన్ని నిదర్శనము లగుపడుచున్నవి. ఒకటి వారి భాష సరళ సులభ సుందరమై, స్పష్టమై, పఠితల కందుబాటులో నుండుట. ఎక్కడో వర్ణనలున్నచోట తప్పితే సర్వత్రా భాష అతి మృదుమధురము. రెండవది కథ యందలి పాత్రలు స్వయముగా మాట్లాడినట్లుండుట, నన్నయ శకుంతలా భీమాది పాత్రలు, తిక్కన ద్రౌపదీ కృష్ణధర్మరాజాది పాత్రలు ఇత్యాది, సంభాషణాత్మకమైన భాషను తిక్కన మరింత తీర్చిదిద్దినట్లు కనుపడను. కావుననే తిక్కన రచనలో నాటకీయత యున్నదని పండితు లనుచున్నారు.

మచ్చుతునకలు :

## నన్నయ వర్ణన :—

శా. ఆ దుష్యంతు డనంత సత్త్వుడు సమస్తాశాంత మాతంగ మ
ర్యాదాలంకృతమైన భూ వలయ మాత్మాయత్తమై యుండగా
నాదిత్యాంశు సమీర దుర్గమ మహోగ్రారణ్య దేశాళితో
నాదిక్షత్ర చరిత్రనేలె నజితుండై బాహు వీర్యంబునన్.

**సంభాషణ :—**

క్రచ్చర వేటవచ్చి యిట కణ్వమహాముని జూచి పోవగా
వచ్చితి మెందు వోయిరొకొ వారనినన్ విని యా లతాంగి, వా
రిచ్చట నుండి యీ క్షణమ యేగిరి కానక బండ్లు దేర మీ
వచ్చుటెరింగి రేని జనవల్లభ వారును వత్తురింతకున్.

**తిక్కన వర్ణన :—**

ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రన్నన విడ్చివెంట్రుకల్
దా వలచేతఁబూని యసితచ్ఛవిఁ బొల్చుమహా భుజంగమో
నా విలసిల్లి వ్రేలగ మనంబునఁ బొంగు విషాద రోషముల్
గావగలేక బాష్పములు గ్రమ్మగ డిగ్గున లేచి యార్తయై.

**సంభాషణ :—**

ఇవి దుస్ససేను వ్రేళ్ళం దవిలి సగముఁ ద్రెవ్విపోయి తక్కినయవి, కౌ
రవుల కడఁదీరు మాటల యవసరమున దలపవలయు నచ్యుత వీనిన్.

**అల్లసాని పెద్దన వర్ణనము :—**

అటఁజని కాంచె భూమిసురుఁ డంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
గటక చరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్.

**సంభాషణ :—**

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు ? భూసురేంద్ర ! యే
కాంతము నందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవ చొప్పు ? నీ
కింత భయంబులే కడుగ నెల్లిదమైతిమె ? మాటలేటికిన్.

**ముక్కుతిమ్మన వర్ణనము :—**

మ. జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామ పాదంబునం
దొలఁగం ద్రోచె లతాంగి; యట్లయగు నాథుల్నేరముల్సేయఁ బే
రలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారము ల్నేర్తురే ?

**సంభాషణ :—**

చ. నను భవదీయ దాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁ బూని తాఁ
చిన యది నాకు మన్ననయ; చెల్వగు నీ పద పల్లవంబు మ
త్తను పులకాగ్ర కంటక వితానము దాఁకిన నొచ్చు నంచు నే
ననియెద; నల్క మానవు గదా యిఁకనైన నరాళ కుంతలా!

## దృశ్య కావ్య స్వరూప స్వభావములు :

బ్రహ్మ ఇంద్రాది దేవతల ప్రార్థన నంగీకరించి, నాట్యమను పేరు గల పంచమ వేదమును సృష్టించుటకై, చతుర్వేదముల నుపాసించెను.

ధర్మ్యమర్థ్యం యశస్యంచ సోపదేశ్యంస సంగ్రహమ్।
భవిష్యతశ్చ లోకస్య సర్వ కర్మానుదర్శకమ్॥
సర్వ శాస్త్రార్థ సంపన్నం, సర్వ శిల్ప ప్రవర్తకమ్।
నాట్యాఖ్యం పంచమం వేదం, సేతిహాసం కరోమ్యహమ్॥
జగ్రాహ పాఠ్యమ్ ఋగ్వేదాత్, సామభ్యోగీత మేవచ।
యజుర్వేదాత్ అభినయాన్ రసానాథర్వణాదపి॥

ఋగ్వేదము నుండి పాఠ్యమును, అనగా ఇతివృత్తమును, సామవేదము నుండి గీతమును (సంగీతమును), యజుర్వేదము నుండి అభినయమును, అథర్వణము నుండి నవరసములను గ్రహించి, నాట్య వేదమను పంచమ వేదము సృష్టించెను. ఈ నాట్య ప్రయోజనమును చెప్పినాడు. ఇది ధర్మ ప్రతిపాదకమును, అర్థమును యశమును కూర్చునదియు, క్లుప్తమైన ఉపదేశ సహితమును, ముందు తరములవా రాచరింపవలసిన సర్వ సత్కార్మాచరణ ప్రేరకమును, సర్వ శాస్త్రార్థ సంపన్నము,ను సర్వ శిల్ప ప్రవర్తకమును కావలెను.

"భవతాం దేవతానాం చ శుభాశుభ వికల్పకః
కర్మభావాన్మయాపేక్షి నాట్యవేదో మయాకృతః
నైకాంతతోఽత్ర భవతాం దేవానాం చానుభావనమ్
త్రైలోక్యస్యాస్య సర్వస్యనాట్యం భావాను కీర్తనమ్
క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః

క్వచిద్ధాస్యం క్వచిద్యుద్ధం క్వచిత్కామః క్వచిద్వధః
ధర్మోధర్మ ప్రవృత్తానాం కామః కామోపసేవినామ్
నిగ్రహో దుర్వినీతానాం వినీతానాం దమక్రియా
క్లీబానాం ధార్ష్ట్య జనన ముత్సాహః శూరమానినామ్
అబుధానాం విబోధశ్చ వైదుష్యం విదుషా మపి
ఈశ్వరాణాం విలాసశ్చ స్థైర్యం దుఃఖార్దితస్యచ
అర్థోపజీవినా మర్థో ధృతి రుద్విగ్న చేతసామ్
నానాభావోప సంపన్నం నానావస్థాంత రాత్మకమ్
లోక వృత్తానుకరణం నాట్యమేతన్మయాకృతమ్
ఉత్తమాధమ మధ్యానాం నరాణాం కర్మసంశ్రయమ్
హితోపదేశ జననం ధృతిక్రీడా సుఖాదికృత్
(ఏతద్రసేషు భావేషు సర్వకర్మక్రియాస్వథ
సర్వోపదేశ జననం నాట్యం లోకే భవిష్యతి)
దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్
విశ్రాంతి జననంకాలే నాట్యమేతద్భవిష్యతి.
ధర్మ్యాం యశస్య మాయుష్యం హితం బుద్ధి వివర్ధనమ్
లోకోపదేశ జననం నాట్యమేత ద్భవిష్యతి.
నతత్ జ్ఞానం నతచ్ఛిల్పం నసావిద్యానసా కలా
నాసౌ యోగోనత త్కర్మ నాట్యేఽస్మిన్ యన్నదృశ్యతే
తన్నాత్రమన్యుః కర్తవ్యో భవద్భి రమరాన్ ప్రతి
సప్తద్వీపానుకరణం నాట్యమేతద్భవిష్యతి
దేవానా మసురాణాం చ రాజ్ఞామథ కుటుంబినామ్
బ్రహ్మర్షీణాంచ విజ్ఞేయం నాట్యం వృత్తాంత దర్శకమ్
(వేద విద్యేతిహాసానా మాఖ్యాన పరికల్పనమ్
వినోదకరణం లోకే నాట్యమేతద్భవిష్యతి
శ్రుతిస్మృతి సదాచార పరిశేషార్థ కల్పనమ్
వినోదజననం లోకే నాట్యమేతద్భవిష్యతి)"

ఈ నాట్యవేదము శుభాశుభ ఫలములను, ధర్మాధర్మ స్వభావములను ప్రదర్శించును. మూడు లోకములవారి భావములను వ్యక్తము చేయును. ఇందొకచోట ధర్మము, ఒకచోట శమము, ఒకచోట హాస్యము, వేరొకచోట యుద్ధము ప్రదర్శింపబడును. ఇది లోకవృత్తానుకరణమును, నానావస్థాంతరాత్మకమును, నానాభావోప సంపన్నమునునై, ఉత్తమ మధ్యమ అధమ భేదముల వారగు మానవుల యొక్క వివిధ కర్మలను ప్రదర్శించును. ఇది హితమును, ధైర్యమును, క్రీడను, సుఖమును కలిగించునదియై ఉపదేశాత్మక మగును. సామాజికులకు దుఃఖమును, శ్రమను పోగొట్టి హితమును, యశస్సును, ఆయువును, బుద్ధివికాసమును కూర్చును. ఈ నాట్యమందు కన్పట్టని జ్ఞానముకాని, శిల్పముకాని, విద్యకాని, కళకాని, యోగముకాని, కర్మకాని లేదు. సర్వశాస్త్రములును, సర్వశిల్పములును, వివిధములైన కర్మలును ఈ నాట్యమందు కూడియున్నవి.

**లాక్షణికులు - దృశ్యకావ్య స్వరూపము :-**

దృశ్యకావ్యములలో ఇతివృత్తము త్రివిధము. ప్రఖ్యాతము, ఉత్పాద్యము మిశ్రమము. ఇవియు మరల రెండు విధములు. సూచ్యము (సూచింపదగినది, ప్రదర్శనాయోగ్యమైనది). అసూచ్యము (సూచింపదగనిది, ప్రదర్శింపరానిది). ఈ ప్రదర్శింపదగినదియైన సూచ్యమే మరల ద్వివిధము. దృశ్యము, శ్రవ్యము. ప్రధానపాత్రలచే రంగస్థలముపై ప్రదర్శింపదగినది దృశ్యము. అట్లు ప్రదర్శింపరానిది (అననుకూలమైనది) విష్కంభము, చూళిక, అంకాస్యము, ప్రవేశకము, అంకావతారము అను అయిదు విధములయిన శ్రవ్యరూపములను ప్రదర్శింపబడును. అనగా అప్రధానములైన (ఒక్కొక్కప్పుడు కథతో సంబంధమేలేని) పాత్రలద్వారా, రంగస్థలముపై ప్రదర్శింపరాని విషయములను, వేనిని తడవక నాటకము ప్రదర్శించుటకు వీలుపడదో అట్టివిషయములను చెప్పించుట. శ్రవ్యము మరల ద్వివిధము. సాధ్యము, అసాధ్యము. సాధ్యములు:- చుంబనము, గాఢాలింగనము, ఏకశయ్య, సంభోగము మున్నగునవి. ఇవి ప్రదర్శించుటకు సాధ్యములే కాని కూడదు. అసాధ్యములు :- యుద్ధము, మరణము, రాజ్యవిప్లవము, స్నానము, అనులేపనము, భోజనము మొదలగునవి.

## ఆధునికుల దృష్టిలో దృశ్యకావ్య స్వరూప స్వభావములు :-

దృశ్యకావ్యము లందలి భాష సులభాతి సులభమై, సరళమై సుందరమై స్పష్టమై, మనోహరము కావలెను. భిన్న భిన్న పాత్రలను ప్రవేశ పెట్టుటవలన సామాజికుల మనస్సుల నాకర్షించి వాని సంభాషణముల వలన ఉద్దేశింపబడిన నిర్దిష్టమైన ఉపదేశములను వారి మనస్సుల కెక్కించి కార్యోన్ముఖులను చేయుటయే యిందలి ప్రయోజనము.

నాటకమందలి పాత్రలు, రామాదులు, సహజముగ మాట్లాడి నట్లుండ వలెను కదా ! వారు పద్యములలో మాట్లాడి యుండరే. అటు కాళిదాసాది సంస్కృత కవులు ఇటు తెలుగు కవులు సంభాషణలో పద్యముల నేల ప్రవేశ పెట్టిరి ? ఇది యసహజము కదా ! అనియు ఆధునికులలో కొందఱు సందేహ మును వెలిబుచ్చుచున్నారు. ఆ మాటకు వచ్చిన నాటకము, తత్ప్రదర్శనమే కృత్రిమము, అసహజము అగును. రోగికి అయిష్టమైన చేదు మందును త్రాగించు టకు వైద్యుడు చక్కెర కలిపియో తేనె కలిపియో దానిని అమృతప్రాయముగా నొనర్చి త్రాగించి రోగనివారణ మొనర్చును. అట్లే నాటక ప్రయోక్తయు, నాటక కర్తయు ఛందోబద్ధమైన శ్రావ్య పద్యామృతమును ఉపదేశ నిష్టితమైన విషయ మను మందుతో చేర్చిన సామాజికుడు ఆనందముగ ననుభవించును కదా ! ప్రయోజన సిద్ధియు నగును. వాల్మీకి, పరాశర వ్యాసాది ప్రాచీన కవుల రచనలు నిర్వచనములు. వాని ప్రభావము సర్వ ప్రపంచ మానవ మనః ఫలకముల చెరగని ముద్దర వేసినది. గద్యమున కన్న పద్యమే సులభ సుందర గ్రహణ సాధన మైనది. అట్లగుటచేతనే కాళిదాసాది నాటక కర్తలు, ఉపదేశించ దలచిన విషయ ములను ముఖ్యముగా పద్యములద్వారానే అందించినారు. శాకుంతలములోని శ్లోక చతుష్టయ మట్టిదే. తెలుగులో వెలసిన అనేక నాటకము లట్టివే. పద్యము హృద్య మైన దగుట, తద్వార ఉపదేశామృతము నందించిన సులభ సుందరమై, సుగ్రా హ్యమై శ్రోతనుత్సూత నూగించి కార్యోన్ముఖుని జేయును. ప్రియురాలందించిన పానీయమును వలె తృప్తిగా తనివిదీర ననుభవించును. తిరుపతికవుల పాండవో ద్యోగ విజయములు కేవలము పద్య నాటకములనియే చెప్పవచ్చును. ఆంధ్ర దేశమున నిప్పుడధిక ప్రచారములో నుండి ప్రజాదరణ పొందిన నాటకములును నివియే. శ్రావ్యములై వినుటకింపైన పద్యములుండుట చేతనే వాటి విలువ

హెచ్చినది. ఇదంతయు పద్య ప్రభావమే. ప్రదర్శనమున ఈ పద్య పఠనము కావ్య ప్రయోజనమున కంటెను ఎన్నియో రెట్లధిక ప్రయోజన కారియై భాసిల్లుచున్నది. నాటకములలోని బాష సమాసాడంబరము కలిగి సుదీర్ఘములైన వాక్యములు కలిగి యుండరాదు. అనవసరమైన వర్ణన లుండరాదు. ఉదాహరణమునకు బలిజేపల్లి వారి హరిశ్చంద్రలో గంగానదీ ఘోష వర్ణనము. కాశీవిశ్వేశ్వరరాలయ గోపుర వర్ణనము మున్నగునవి. ఏలనన సామాజికులు వినుట తోడనే ఆ పద్యములోని భావమును గ్రహణము చేయ గలుగ వలెను. అప్పుడే కదా వారికి రసానుభూతి ఏర్పడును. శృంగారమును, హాస్యమును ప్రదర్శించునపుడు అతిసుకుమార సుందరము కావలెను. జుగుప్సాహేతువు కారాదు. ఉదాహరణమునకు హరిశ్చంద్ర లోనే చంద్రమతీ హరిశ్చంద్రుల వియోగ సమయమున చంద్రమతి హరిశ్చంద్రునితో పలికిన పద్యము; "కదలవేమని విప్రు డదలించుటకు మున్నె మీ నోటి నుడి తేనెలాన నీడు; ఇంపార మిము కౌగిలింపనిండు" అనుచితమైనది. దీనికంతకును హేతువు పూర్వకవుల శ్రవ్యకావ్య ప్రభావమే. నాటకకర్త వీనినెరిగి వర్తించనగును. కాళిదాసాది నాటక కర్తలు, అసామాన్య కల్పనా చతురులగుట చేతనే, తమ నాటకములలో నుచితమై ప్రదర్శనాయోగ్యమైన శృంగారమునే వ్యక్తముచేసినారు. అనుచితమై జుగుప్సాకరమై, ప్రదర్శనమున కననుకూలమైన పచ్చి శృంగారము వంకకే పోలేదు. ఉదాహరణమునకు కాళిదాసు తన అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంతుడు తన విదూషకునకు, శకుంతలయొక్క అంద చందములను వర్ణించి చెప్పునప్పటి శృంగార రసపోషణమును గమనించిన, ఆతడెంతటి యుచితజ్ఞుడో, ఎంతటి నాటక రచనా సమర్థుడో స్పష్టమగును.

"చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా;
రూపోచ్చయేన విధినామనసాకృతాను;
స్త్రీ రత్న సృష్టిరపరా ప్రతిభాతిసామే
ధాతుర్విభుత్వ మనుచిన్త్య వపుశ్చతస్యాః
అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనంకరరుహైః
అనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదితరసమ్,
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూపమనఘమ్,
నజానే భోక్తారం కమిహసముప స్థాస్యతి విధిః".

పై పద్యములలోని భావము ఎంత సుస్నితమో అంత మనోహరమును నైయున్నది. తెలుగునాటకములలో నిట్టి మనోజ్ఞశృంగారమును ప్రదర్శించినవాడు మహాకవి కాళ్లకూరి నారాయణరావు. వారు తమ చింతామణి నాటకమున పండితుడు ధనవంతుడు మూర్తీభవించిన మానవతామూర్తి, నాయకుడైన బిల్వమంగలుడు చింతామణిని చూచి, ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై వర్ణించిన సన్నివేశమున-

''రెప్పలు వాల్పకుండిన, ధరిత్రిని పాదములంటకుండినన్,
తప్పక రంభయో మరి ఘృతాచియొ మేనకయో యటంచు
నిక్కప్పుర గంధిపట్ల భ్రమ గల్గకపోవదు, ఆలకింపలే
దిప్పురమందె యిట్టి జలజేక్షణ యుండునటంచు నెన్నడున్''

అట్లే పానుగంటివారు తమ విప్రనారాయణ నాటకమున, విప్రనారాయణుని చేరవచ్చెడి దేవదేవిని శ్రీనివాసుడు వర్ణించిన సన్నివేశమున-

సీ. పావన తులసికా పద్మబీజస్తోమ
 రచితమాలలు మెడ గ్రాలుచుండ,
తీరుగా దిద్దిన తిరుమణి తిరుచూర్ణ
 తిలకంబు దివ్య దీధితులనీన,
నీరెండ తీరుండు సీర్కావికాషాయ
 తళతళల్ తనువంత నలమి కొసగ,
రమ్యనాదముతోడ రంగనామము బల్క
 మురళి గానపురీతి మురువుగొలుప,

గుటిక లొదవించు చిత్రాన్న ఘుటికవంటి
వర్ణమును గల్గి, వెన్నయప్పమునుబోలె
మెత్తనై, బోడిదౌ రాగెమిల్లి చెంబు
చేతగ్రాలంగ, నదిగో వేంచేయునొకతె.''

ఎంతటి యపురూప సుస్నిత శృంగారము! ఎంతటి గంభీర హాస్యరచనా చమత్కృతి! నాటకములలో శృంగార హాస్యములిట్లే యుండవలెను.

**సమాజమునకు దృశ్యకావ్యముల ఉపకారము:**

బాలుడు శ్రవణగ్రహణమున, తల్లిదండ్రులయొక్కయు, పరిసరముల యొక్కయు భాషా ప్రవాహమును, భావ సముదాయమును వాక్యరూపమున మనఃకటాహమున నించుకొనును. వాగింద్రియములు అనుకూలించినపుడు, తనకు గల అనుకరణ శక్తియను వేడిమి తాకిడిచే, నావిరిగా, పొగలు పొగలుగా, మంచుగా ముఖమునుండి భాషణ రూపమున వెల్వడును. ఆ సమయమున నుపాధ్యాయుడు వచశ్శక్తిని పెంచుటకు, తగిన సాధనముల సమకూర్చవలెను. అట్టి సాధనములలో అమితాహ్లాదకరమైన సంభాషణము ప్రధానము. ప్రభావితము. ఇది యించుమించుగా నొక చిన్న నాటకము. శబ్దశక్తిని పెంచుటకును నిదియే ఉచితమైన సాధనము. శబ్దమునకు శక్తి భాషణ రూపముననే యేర్పడును. భాషణమెంత పటిష్ఠమైన పఠనమంత యోగ్యమగును. భాషాభ్యసనమున, ఈ భాషణ పఠనములే భావాభివ్యక్తికి నిభావగ్రహణమునకును ముఖ్యమైన సాధనములు. ఇవి లేక భాష భాసింపదు. వీని నభివృద్ధిపరచుటకే ప్రకల్పనాపద్ధతి క్రీడాపద్ధతి మున్నగు నవీన పద్ధతులను విద్యాబోధనమున ప్రవేశ పెట్టుచున్నారు. నాటకము విద్యార్థులకు క్రీడ. తద్వార భాషను శక్తివంతముగా నుపయోగించు నేర్పలవడును. విద్యావంతులగు గ్రామీణ ప్రజలకు విద్య నేర్పుటగాని, వారి వారి యనుకూల కర్మాచరణమునకు సమర్థులుగా నొనర్చుటకుగాని, యీ నాటకము లెంతయో ఉపకరించును. భాషలో శబ్దములను భావానుగుణ్యముగ నుపయోగించుట, నాటకాభ్యసనము వలననే సాధ్యమగును. ఉదాహరణమునకు, "నీ వెంతటి బుద్ధిమంతుడవు!'' అనిన అబుద్ధిమంతుడవన్న యర్థము ద్యోతకమగును. అట్లే "వాడసత్యవంతుడు, నే నసమర్థుడను'' అన్న వాక్యములు ఉచ్చారణా శక్తి ననుసరించి యర్థము నిచ్చును. యథోచిత రసానుభూతిని కలిగించుటకు గద్యపద్య సంభాషణమున మంచి నేర్పవసరము. అది నాటకాభ్యసనము వలన, నాటక పఠనము వలన నేర్పడును. సాహిత్యమునం దభిరుచి, తదభివృద్ధి పోషణములు దృశ్యకావ్య దర్శన, శ్రవణ, పఠనములపై నాధారపడి యున్నది. కావుననే, ''కావ్యేషునాటకం రమ్యమ్'' అని భావుకుల నిర్ణయము.

—: ० :—

# సాహిత్యాధ్యయనం : పత్రికలు

పి. యస్. ఆర్. ఆంజనేయ శాస్త్రి,

ఉదయాన్నే కాఫీ తాగుతూనో, టీ సేవిస్తూనో పేపర్ పరికించటం ఈ రోజుల్లో చాలామందికి అలవాటు. పేపరెందుకు చదువుతారు? నా మట్టుకు నాకు మూడు ముఖ్య కారణాలు కనిపిస్తున్నాయి. ఒకటి: ఉద్యోగ ప్రకటనలు, వ్యాపార ప్రకటనలు చూడాలని; రెండు: రాజకీయాల్లో అభిరుచి; మూడు: సినిమాలు.

మన దేశం పంచవర్ష ప్రణాళికల్ని అనులు పరచుకొని ఎంత అభివృద్ధిని, అధికోత్పత్తిని సాధిస్తున్నప్పటికీ జనాభా నియంత్రణ సరిగా జరుగక ఆ ఉత్పత్తి అంత గణనలోకి రావడంలేదు. విద్యావకాశాలు బాగా పెరిగినందు వల్ల విద్యార్థికులు ఏటేటా ఎక్కువవుతున్నారు. ఈ రెండు కారణాలూ కలిసి - మెరసి నిరుద్యోగ సమస్యను తీవ్రతరం చేస్తున్నాయి. కాబట్టి ఇరవై అయిదేళ్లలోపు వాళ్లు పేపర్ తిరగేస్తున్నారంటే ముఖ్యంగా ఉద్యోగ ప్రకటనల కోసమే అవుతోంది. అందుకనే ఉద్యోగాల్ని గురించి తెలియజేసే ప్రత్యేక పత్రికలు కూడా వచ్చాయి.

పేపర్లలో ఎక్కువ మందిని ఆకర్షించేది, రాజకీయవార్తలు. దేశం సామ్యవాదం వైపు పురోగమిస్తూ జాతీయ అంతర్జాతీయ రంగాల్లో అనుసరిస్తున్న విధానాలవల్ల, ప్రపంచ రాజ్యాల్లోని కూటముల వల్ల, మనం అనుసరిస్తున్న ఆర్థిక పథకాల వల్ల నిత్య జీవితం మీద ఎట్టి ప్రభావం పడుతున్నదో, మున్ముందు ఎటువంటి ప్రభావం పడుతుందో తెలుసుకోడం కూడా ఇప్పుడు రాజకీయాభిరుచి క్రిందే లెక్క. పోర్టుఫోలియోల కూర్పు దగ్గర నుంచీ మంత్రుల పర్యటనల వరకూ అన్ని విషయాలూ రాజకీయాల పరిధిలోకే వస్తున్నాయి. ఈ ఆలోచనాధోరణిని అలవాటు చేసింది పత్రికలే. వివిధ రకాల వార్తల్ని తెలుసుకోడమే కాకుండా ఆయా ప్రముఖుల ప్రకటనలను నిగూఢదృష్టితో - ఇన్ బిట్వీన్ ది లైన్స్-చదివి వ్యాఖ్యానించుకోడానికి అవసరమైన పరిజ్ఞానాన్ని పత్రికలు అందజేస్తున్నాయి.

ఈ రకమైన అభిరుచి అన్ని వయో వర్గాల్లోనూ ఉంటున్నది. తాను ఏ కెరీర్ ఎన్నుకొని ఏ విధంగా పైకి రావాలో పథకం వేసుకోడానికి గాని, తాను చేస్తున్న ఉద్యోగాన్ని నిలబెట్టుకొని తన పదవిని ఆదాయాన్ని సుస్థిరం చేసుకోడంతో పాటు అభివృద్ధి పరుచుకోవాలన్న ఆలోచన చేయడానికి గాని, కేవలం సిద్ధాంత వాద దృష్టి- అభినివేశంతో ఎప్పటికప్పుడు పరిణామాన్ని పరిశీలించడానికి గాని పత్రికాధ్యయనం ఈ రోజుల్లో తప్పని సరి. ప్రజల ఈ అవసరాన్ని తీర్చే పత్రికలే ఎక్కువ. ఇకపోతే, సాంస్కృతిక దృష్టితో మానసిక వికాసానికి, మానసికోల్లాసానికి, వినోదానికి ప్రయత్నించే వయోవర్గాలకు కూడా పత్రికలు తోడ్పడుతున్నాయి. ఈ అంశం క్రింద ఎక్కువ మందిని ఆకర్షిస్తున్నవి సినిమాలు. ఈ విశేషాన్ని అందించేందుకు కూడా ప్రత్యేకంగా పత్రికలు వచ్చాయి.

ఆర్థిక వ్యవహారాలను, శాస్త్ర సాంకేతిక వ్యవహారాలను, ఇతర ప్రత్యేకాంశాలను గురించి విజ్ఞానాన్ని అందించే పత్రికలు సకృత్తయి పోతున్నాయి. ఆ కోవలోనే ఉంటున్నాయి సాహిత్య పత్రికలు కూడా. ఒక రకంగా చెప్పుకోవాలంటే, ఇప్పట్లో సాహిత్య పత్రికలు లేవనుకోవాలి.

మన తెలుగు భాష వరకూ తీసుకుంటే, పత్రికలు సాహిత్యపరంగానే ముందు అవతరించి క్రమంగా సాహిత్యాన్ని వెనక్కి నెట్టేశాయనవచ్చు. ముందు వచ్చిన చెవుల కన్న వెనుకవచ్చిన కొమ్ములు వాడి అన్నట్లు పత్రికల్లో ఇతరాంశాల ప్రాధాన్యం ఎక్కువై పోయి లక్ష్యం శతధాకరించడమౌతోంది. ఆబాల గోపాలాన్నీ అలరించడానికి పత్రికలు- అనే ధ్యేయం కోసం ఇప్పుడు నడక సాగించడం తప్పనిసరి అయింది. ఆ ప్రకారం, పత్రికా రచయిత ఏదో ఒక ప్రత్యేక విషయంలో నిష్ణాతుడై లాభం లేదు; జాక్ ఆవ్ ఆల్ ట్రేడ్స్‌గా మెలగగలిగిన పరిజ్ఞానం ఉన్నప్పుడే ఇప్పుడు పత్రికా రచయిత విజయవంతమైన పత్రికా రచయితగా లెక్కలోకి వస్తాడు.

మనం తరచు 'పేపర్' అని వ్యవహరించే పఠనీయ సాధనకు ఇప్పటి స్వరూప స్వభావాలు స్థూలంగా ఇవి.

'పేపర్' అంటే రూఢార్థం దినపత్రిక అని. పత్రిక అంటే రూఢార్థం 'జర్నల్' అని; అంటే వారపత్రిక కావచ్చు, మాస పత్రిక కావచ్చు, పక్షపత్రిక కావచ్చు, మరే పీరియాడికల్ అయినా కావచ్చు.

ఈ పేపర్ పుట్టు పూర్వాలేమిటో కొంచెం పరిశీలిద్దాం.

బొమ్మల రూపంలోనే గాని, అక్షరాల రూపంలోనే గాని, సంకేతాలరూపం లోనే గాని వ్రాయడం ప్రారంభమైనాక తేలికగా నలుగురికీ అందుబాటులో ఉండే సాధనం కోసం అన్వేషణ జరిగినది. ఈజిప్షియన్లు 'పాపిరస్' అనే చెట్టు బెరడు తీసి దాని చదును చేసి, దాని మీద సిరాతో వ్రాయడం కనుగొన్నారు. పాపిరస్ చెట్టు పేరే పేపర్ అనే పదానికి మూలం. పాపిరస్ లోంచి తయారు చేసు కున్నది పేపరైంది. కొందరు వ్యాపారస్తులు పాపిరస్ చెట్టును గ్రీకు దేశానికి చేరవేశారు. అక్కడ బిబ్లోస్ అనే ఊళ్లో వాటిని పెంచి ఆ వూరు పేరుతో బిబ్లియా అని ఆ చెట్టుకు పేరుపెట్టుకున్నారు. బిబ్లియా చెట్టు బెరడు వాడుకొని వ్రాసుకున్న పుస్తకాలు 'బైబిల్'గా వ్యవహారంలోకి వచ్చాయి. అయితే చెట్టు బెరడ్లు, నారలు, గడ్డి, చింకిపాతలు, చేపలు పట్టే వలలు- ఈ పదార్థాల్ని రుబ్బి గుజ్జుగా మార్చి ఆ గుజ్జు నుంచి చదునైన కాగితాన్ని తయారు చేసే తెలివి తేటలు మొట్టమొదట చైనా దేశంలో బహిర్గతమయ్యాయి. క్రీ. శ. 105 లోనే కాగితం చెయ్యడం చైనీయులకు తెలుసు. కాని క్రీ. శ. 751 లో ఆ ప్రక్రియ పశ్చి మాసియా, ఐరోపా దేశాలకు ప్రాకింది. మధ్యాసియాలో జరిగిన ఓ యుద్ధంలో కాగితం చెయ్యడం తెలిసిన చైనీయుల్ని అరబ్బులు పట్టుకొని తమతో తీసుకు పోవడంతో కాగితం వ్యాప్తిలోకి వచ్చింది. ఇప్పుడు ముద్రణకు సర్వ సాధార ణంగా వాడుతున్న టైపులకు మూలం 14 వ శతాబ్దిలో పడింది. 1398 నుంచి 1468 వరకూ జీవించిన జోహాన్ గటెన్‌బర్గ్ అనే అతనూ, అతనికి పెట్టుబడి పెట్టిన ఓ స్వర్ణకారుడు జోహాన్ ఫస్ట్ అనే అతను కలిసి లోహాలతో టైపులు తయారుచేశారు. ఆ లోహపు అక్షరాలతో 1456 లో వాళ్లు బైబిల్ ముద్రించారు. క్రీ శ. 1500 నాటికి సుమారు 183 ఐరోపా పట్టణాలల్లో ముద్రణాలయాలు ఏర్పడ్డాయి. అప్పటి నుంచి రాజకీయపరం గాను, మత పరంగాను గొప్ప పరి ణామం సంభవించి విషయాన్ని పలువురు తెలుసుకొనే సాధనం అందుబాటైంది.

ఆ మీదట ప్రపంచ నాగరకతలో కాగితం, ముద్రణ ఒక ప్రధాన భాగ మైంది. ఇప్పుడు మనం వాడుతున్న గ్రంథ సాధనాలన్నీ ఈ పాశ్చాత్య నాగర కతాభివృద్ధి ఫలితాలే.

మన దేశంలో, అందులోనూ తెలుగు దేశంలో ఈ 'పేపర్'కు మూలమేమిటి ?

ఒక్క ముక్కలో చెప్పాలంటే–తాళపత్రం.

తెలుగు ప్రజల సంస్కృతిలో తాటిచెట్టుకు ఎనలేని ప్రాధాన్యం ఉంది. తాడిచెట్టును కల్పవృక్షంగా భావించేవారు. తాటి తోటలు పెంచడం ప్రాచీనుల దృష్టిలో ముఖ్యకార్యం. పట్టణ నాగరకత, యాంత్రిక నాగరకత పెచ్చరిల్లిన తర్వాత వ్యక్తిగతమైన ఆ స్నేహపూర్వక భావం ప్రకోపించింది గాని, పూర్వ గ్రామ సంస్కృతిలో ప్రకృతిసంపద ఉమ్మడిసొత్తుగానే ఉండేది. ప్రతివారికొక తాటితోపు అవసరం. తాటిచెట్టులోని ప్రతి భాగమూ జనజీవనంలో ప్రయోజనకరంగా వినియోగమయ్యేది. తాటి దూలాలు, తాటియాకులు, తాటినార, తాటియాకు చాపలు, బుట్టలు, నీళ్లు తోడుకొనేందుకు తాటియాకుతో బొక్కెనలు, తాటియాకు గొడుగులు, తాటి దోనెలు, తాటిపండ్లు, తేగలు, తాటిబెల్లం-ఇలా తాడి ఉపయోగం ఆమూలాగ్రం.

ఇందులో మన 'పేపర్'కు తాటియాకు ప్రాతిపదిక. తాళపత్ర గ్రంథాలు మన ప్రాచీన విజ్ఞానం నిక్షిప్తమై ఉన్న నిధులు, తాటియాకుల్ని ఈనెలు తీసి కట్టలుకట్టి పేడనీళ్లలో ఉడకబెట్టి తీసి నీడలో ఆరబెట్టి నిల్వ చేసుకొనేవారు. ఇలా చేసినందువల్ల తాటియాకులు చాలాకాలం మన్నుతాయి. ఈ తాటియాకుల మీద పూర్వికులు గ్రంథాలు వ్రాయడమేకాదు; మామూలుగా ఉత్తరాలు కూడా వ్రాసేవారు. కమ్మ అంటే ఆకు; ఆకుమీద వ్రాసిన ఉత్తరం కూడా కమ్మ అయిపోయింది కమ్మ అంటే జాబు అనే అర్థం వ్యవహారంలోకి వచ్చింది. అలాగే కమ్మ అంటే పేజీ అనికూడా అర్థం. నాలుగు కమ్మల పత్రిక అంటే నాలుగు పేజీలు పేపరని అర్థమే. కమ్మ అంటే ఇంకో అర్థం కూడా ఉంది-చెవికి పెట్టుకొనే ఆభరణం. ప్రాచీనుల్లో సువర్ణాభరణాలు లేనివారు తాటియాకు రింగుగా చేసుకొని పెట్టుకొనేవారు. ఆటవిక జాతుల్లో అటువంటి కమ్మలు ఇప్పటికీ కనిపించవచ్చు. తాటియాకుతో చేసిన కర్ణాభరణాన్నే 'తాటంక' మనేవారని ఓ అభిప్రాయం లేకపోలేదు.

ఇంతకూ, భూలోక కల్పవృక్షమైన తాటిచెట్టునుంచి తీసి భద్రపరిచిన తాటియాకులే మన పేపర్‌కు ప్రాతిపదిక. పెండ్లి కమ్మ అంటారు, అంటే-వివాహ పత్రిక అని అర్థం. కమ్మ అంటే పత్రికై పోయింది.

అనుకుంటే తమాషాగా ఉంటుందికాని, తాటియాకులోంచే వార్తా పత్రిక పుట్టింది; నాగరకత పెరిగింది.

ఇప్పుడు వార్తా పత్రిక నాగరకతకు చిహ్నం. 'పుస్తకం హస్తభూషణం' అన్న పద్ధతిని వార్తా పత్రిక ఒకటి చేత పెట్టుకొని తిరగడం వ్యక్తి వ్యవహార జ్ఞానానికి ఒక సూచన. నిత్య జీవితంలో పత్రిక ఒక భాగం.

ఇంతకుమునుపే ప్రస్తావించినట్లు, ఆదిలో పత్రికలు సాహిత్యపత్రికలుగనే ఉండేవి. జనసాంద్రత, జనసంఖ్య తక్కువ, ఆర్థికస్తోమత ఎక్కువ, జీవితంలో వేగం ఉండేదికాదు, రాజకీయాలు ప్రజలమీద ఆధారపడి నడిచేవి కావు, తీరిక ఎక్కువ- ఈ పరిస్థితుల్లో వ్రాయను చదువను నేర్చినవారికి సాహిత్య సమస్యలే తప్ప ఇతర సమస్యలు లేవనిపించిన రోజుల్లో పత్రికలు ప్రారంభమయ్యాయి; సాహిత్యాన్ని చర్చించాయి. విదేశీ పరిపాలన రోజుల్లో గెజెట్లు పత్రికల పని పూర్తి చేసేవి; అవే కవిలె కట్టలై చారిత్రకాధారాలుగా నిలిచాయి. మన దేశంలో స్వాతంత్రోద్యమంతో ఆధునిక పత్రికా స్వభావానికి రూపకల్పన జరిగింది. రెండు ప్రపంచ యుద్ధాలతో పత్రికల అవసరం పెరిగింది. ఏ దేశంలో ఏ పరిణామం సంభవిస్తే అది మన దేశంలో మన మీద ఎటువంటి ప్రభావాన్ని వేస్తుందో పరిశీలించి ప్రజలు, ప్రజల మద్దతుతో ప్రభుత్వాలు వ్యవహరించవలసిన ఆవశ్యకతతో పత్రికల ప్రభావం హెచ్చింది. ఎన్నికల రాజకీయాల ప్రాముఖ్యంతో పత్రికలు సమాచారాన్ని అందించే సాధనాలుగానే కాక, ప్రచార సాధనాలుగా కూడా రూపొందాయి.

సమాచారమే కాక ప్రచారం కూడా పత్రికల స్వభావంగా రూఢమైన తర్వాత వార్త వేరుగా వ్యాఖ్య వేరుగా ఉండవలసిన అవసరం తీరిపోయింది. వార్తనే వ్యాఖ్యగాను, వ్యాఖ్యనే వార్తగనూ మార్చి ప్రజలకు అందివ్వడం సులభసాధ్యమైంది. దానితో ప్రతి పత్రికకు ఒక పాలసీ అంటూ ఏర్పడింది. తన పాలసీని తన సంపాదకీయాల్లో వ్యక్తం చెయ్యడం పత్రిక కర్తవ్యంగా, ధర్మంగా భావించిన రోజులు లేకపోలేదు.

జీవితంలో తీరిక తగ్గి, వేగం హెచ్చడం ఆరంభమైనప్పటినుంచీ పత్రికల స్వరూప స్వభావాలు మారక తప్పలేదు. ఇదివరకు పత్రిక మొదటి పుట నుంచి చిట్టచివరి పుట చిట్టచివరి అక్షరం వరకూ చదివి ఆకళింపు చేసుకోడం ఉండేది.

నిరక్షరాస్యులకు రచ్చబండ ఎలాంటిదో అక్షరాస్యులకు పేపర్ అలా పనికి వచ్చేది. అన్ని విషయాలూ ఆమూలాగ్రం అవగాహన చేసుకొనే అవసరంగాని, అభిరుచిగాని, అవకాశం గాని లేనప్పుడు పత్రికల్లో డిస్‌ప్లేకు ప్రాముఖ్యం వచ్చింది. తనకు కావలసింది పేపర్‌లో ఎక్కడ ఉందో వెతికి చదువుకోవలసిన స్థితి నుంచి పాఠకుణ్ణి పై అంతస్తుకు చేర్చాయి పత్రికలు. నిర్విరామ కార్యక్రమాల్లో తల మున్కలై పోతుంటే పెద్ద పెద్దవాళ్లు స్వయంగా కొంత కాలం వినియోగించి పత్రికలు చదివే పరిస్థితి ఉండదు. అటువంటివారికి ఆ రోజు పత్రికల్లో విశేషాలేమిటో—ఒకరు ముందుగా చదివి క్లుప్తంగా చెబుతారు. అటువంటి ప్రెస్ సెక్రటరీల వంటివే సామాన్యులైన పత్రికా పాఠకుల విషయంలో పత్రికల్లో కనిపించే శీర్షికలు. వార్త అంతా చదవకుండా హెడ్డింగును బట్టి విషయం గ్రహించేందుకు పాఠకుల్ని ఆయత్తం చేశాయి పత్రికలు. ముప్పయ్యయిదు-నలభై ఏళ్ళ క్రిందటి వరకు పత్రికల్లో హెడ్డింగులు ఉండేవి కాదు. విషయాన్ని ఒక కథగా చెప్పుకు పోయే పద్ధతి ఉండేది. పాఠకులకు సౌకర్యంగా ఉండేందుకే కాకుండా, వార్తలో ప్రధానాంశమేమిటో తన దృక్పథంలో పాఠకులకు చెప్పడానికి పత్రికలు హెడ్డింగుల్ని ఆసరా చేసుకుంటున్నాయి. అంటే, ఒక్కొక్క పత్రిక పెట్టే హెడ్డింగునుబట్టి పత్రిక పాలసీని గుర్తించవచ్చు. వార్తను ఎన్నుకోవడంలో, ఎన్నుకొన్న వార్తను పాఠకునికి ఆకర్షణీయంగా ప్రతిపాదించడంలో ప్రజ్ఞ, కళాత్మకత స్ఫురిస్తున్నాయి ఈ నాటి పత్రికా రచనా రంగంలో.

ఈ రోజుల్లో ప్రతి పత్రికారచయిత, ప్రతి విలేఖరి ఆనాడు భారతయుద్ధ సమయంలో సంజయుడు చేసినపని చేస్తున్నాడు. తన కథనాన్ని ఒకే వ్యక్తికి వినిపించడం కాదు, వేలాది అక్షరాస్యులకు అందిస్తున్నాడు.

భావప్రకటన పద్ధతుల్లో మార్పును సాధించిన పత్రికా రచన, భాషలో కూడా మార్పులు తెచ్చింది. గ్రాంథికంగా ఉండే పత్రికాభాష వ్యావహారిక శైలికి మారింది. వ్యావహారిక భాషోద్యమానికి నిజమైన కార్యరంగం పత్రికలే. పత్రికా రచయితలు వ్యావహారిక భాషను సృష్టిస్తున్నారు. ప్రజలకు అందిస్తున్నారు. పండితుల్లోను, విశ్వవిద్యాలయాల్లోనూ వ్యావహారిక భాషానుసరణంపట్ల శషభిషలున్నాయేమోగాని పత్రికారంగంలో వ్యావహారిక భాష వినా మరో భాష లేదు. వ్యావహారిక భాషోద్యమానికి పట్టుగొమ్మలు పత్రికలు; పాఠ్యగ్రంథాల నుంచి

విద్యార్థి ఎటువంటిభాష నేర్చుకొన్నప్పటికీ పత్రికలపఠనంద్వారా మాత్రం అతనికి వ్యావహారికభాష వంటబట్టి తీరుతుంది.

తెలుగుభాష పెరగడానికి కూడా పత్రికల తోడ్పాటు బహుళంగా ఉంది. ఇంగ్లీషు లోంచి వార్తనో, వ్యాఖ్యనో, వ్యాసాన్నో తర్జుమా చేసి పాఠకులకు అందించే ప్రయత్నంలో పత్రికారచయిత కొత్త పదాల్ని సృష్టిస్తున్నాడు, కొత్త పదబంధాల్ని తయారుచేస్తున్నాడు. అన్ని జీవనరంగాలకు సంబంధించిన అన్ని విశేషాలనూ సామాన్యుడికి అందుబాటులోఉన్న నిరాడంబర భాషలో వ్రాయడానికి పత్రికారచయితలు చేస్తున్న కృషి, పడుతున్న శ్రమ అందరికీ తెలిసేదికాదు.

అయినప్పటికీ ఇప్పటి పత్రికాభాష కఠినంగాను, సంకరంగాను ఉంటున్న దని విమర్శించేవా రున్నారు. ఒక ఆంగ్లపదానికి ఒక్కొక్క పత్రిక ఒక్కొక్క తర్జుమా పదాన్ని వాడుకచేసి పాఠకుల్ని తికమక పెడుతున్నదన్న వాదు లేకపో లేదు. ఈ ఫిర్యాదు తొలగాలంటే ఆధునిక పత్రికాపదకోశం- నిఘంటువు- ఒకటి సంకలనం కావాలి. అన్ని పత్రికలూ ఒకే పదాన్ని వాడుకచేసే రీతిలో కట్టడి, క్రమశిక్షణ ఉండాలి! రచన వ్యక్తిత్వ ప్రధానమైనది, వ్యక్తి ప్రతిభాప్రధానుడు. ప్రతిభ సంస్కార ప్రధానమైనది, సంస్కారం హృదయప్రధానమైనది కాబట్టి Gin వంటి కృషికి సరైన ఫలితాలు ఇంతవరకూ లభించలేదు. సౌమనస్య లోపమే ఈ లోపానికి కారణమన్నమాట.

గ్రంథగతంగా మాత్రమే భాష, భావం ఉండిపోనక్కరలేదని చెప్పి ఆ భాషనూ భావాన్నీ ప్రజలకు సన్నిహితమైన రూపంలో శైలిలో పత్రికలు అంది స్తున్నా యనడంలో భిన్నాభిప్రాయానికి తావులేదు.

అయితే—''సాహిత్యాధ్యయనం : పత్రికలు'' అన్న అంశాన్ని స్పృశించా లన్నప్పుడు, పత్రికలు సాహిత్యాధ్యయనానికి ఎలా తోడ్పతున్నాయనా ? పత్రి కలద్వారా జరుగుతున్న సాహిత్యాధ్యయన మెట్టిదనా? పత్రికల్లో సాహిత్య పత్రికల కృషి ఏమిటనా ? సాహిత్యాభ్యుదయానికి పత్రికల తోడ్పాటు ఎట్టిదనా? పత్రికల బాగోగుల అవగాహనకు సాహిత్యాధ్యయన దృష్టి ఎంతవరకు అవసరమనా ? లేక ఇవన్నీనా ?

ముందుగా ఒక్కమాట. ప్రజలకోసం సాహిత్యం సృష్టించిన రోజుల్లోంచి ప్రజల్నిబట్టి సాహిత్యం సృష్టిస్తున్న రోజుల్లోకి సమాజం నడిచివచ్చింది. జీవిత

వేగం, సమస్యల భారం- వీటివల్ల అభిరుచిలో, అవగాహనలో, ఆదర్శంలో ప్రగాఢత సడలి పలచదనం చోటు చేసుకుంది. ఆ పలచదనమే సాహిత్యంలోనూ కనిపిస్తున్నది.

ఈనాటి పత్రికలు ఏవి సాహిత్యపత్రికలు కావు? అన్నీ సాహిత్యపత్రికలే.

ఈనాటి పత్రికలు ఏవి సాహిత్యపత్రికలు కావు. ఏవీ కావు.

ఈ రెండు వాదాలూ వినిపిస్తున్నాయి.

జనాభా పెరుగుదలతోపాటు, అక్షరాస్యతాభివృద్ధితోపాటు ప్రజల్లో చదివే తత్వం, అభిలాష కూడా హెచ్చాయి. ప్రజల్లో ఏదో చదవాలన్న అభిలాషను తీర్చడానికి ఇదివరకు పుస్తకాలు మాత్రమే పనికివచ్చేవి ; ఇప్పుడు పత్రికలు పనికివస్తున్నాయి. పత్రికల్లో అన్నిరకాలవారికి, అన్నివయోవర్గాలవారికీ పనికివచ్చే అంశాలన్నీ సంకలనపర్చి అందజేస్తుండడంవల్ల పుస్తకాల గిరాకీ తగ్గిందన్న భావంకూడా లేకపోలేదు. పుస్తకాలు కొని చదవడంకన్న పత్రికలు కొని చదవడం తేలిక, చవుక. ఇది ఎలా ఉందంటే, నాటకాలకన్న సినిమాలు అందుబాటులో ఉన్నవే కాక వినోదంగా ప్రబలడంలా ఉంది. నాటకాల ప్రత్యేకత నాటకాల కున్నప్పటికీ సినిమాల ప్రాచుర్యంనుంచి అవి తట్టుకోలేక పోతున్నాయి. అదే పరిస్థితి పుస్తకాలు - పత్రికలమధ్య ఏర్పడడంవల్ల ఉత్పత్తి వ్యయాన్ని రాబట్టుకోడానికి పుస్తకాలు ఎక్కువ ఖరీదుకుగాని లభించవనీ, పత్రికలు తక్కువ ఖరీదుకు లభిస్తాయనీ ప్రజలు తెలుసుకున్నారు. పైపెచ్చు పత్రికల్లో వెరైటి సాహిత్యం లభిస్తుంది. పత్రికల్లో వచ్చే కథా నవలా సాహిత్యంగాని వ్యాస సాహిత్యంగాని తర్వాత పుస్తకాలుగా వస్తాయనికూడా ప్రజలకు తెలుసు. జనం ఇప్పుడు కోరుకుంటున్న స్థాయి సాహిత్యమే పత్రికలు అందజేస్తున్నాయి. ఈ సాహిత్యంలో చాలాభాగం దాచుకోవలసినదిగా తోచే సాహిత్యం కాదు. కాలక్షేప సాహిత్యమే ఎక్కువ. పైపెచ్చు ఒక పుస్తకం పుస్తకమంతా ఒక పత్రికలో ఒకేసారి లభించే ఆకర్షణకూడా ఇటీవల పరిపాటి అయింది. చివరకు పత్రికలు మంచి సాహిత్యాన్ని అందజేయాలన్న లక్ష్యంనుంచి క్రమంగాదూరమై, పాఠకుల్ని ఏవిధంగా ఆకర్షించుకోవాలన్న వ్యాపారపు మెరుగుల వంకకు దృష్టి సారించి మనుగడను కొనసాగించుకోవలసిన పోటీ రంగంలో దిగక తప్పడం లేదు.

ఒక విధంగా ఆలోచిస్తే ఇప్పటి సినిమా పరిశ్రమకు, పత్రికా పరిశ్రమకు తేడా కనిపించదు. జనం ఎలాంటి సినిమాలు తీస్తే చూస్తారో అలాంటి సినిమాలే తీస్తున్నారు ! నిర్మాతలు అంటున్నట్లే, జనానికి ఎటువంటి సాహిత్యం కావాలన్న అభిలాష ఉంటో అటువంటి సాహిత్యాన్నే అందిస్తున్నామని పత్రికలవారూ అంటున్నారు. ప్రజల అభిలాష ప్రకారమే కళలు అభివృద్ధి కావలసిన మాట నిజమేగాని, కళలు ప్రజల్లో నీచాభిరుచిని ప్రోత్సహించి తాము నాలుగు కాలాలపాటు నిలవాలా లేక ప్రజల అభిరుచి స్థాయిని పెంపొందించేందుకు తోడ్పడాలా అన్న సమస్య ఇప్పుడు మేధాగతమైనదికాక అర్థగతమైనదిగా మారి పోయింది.

పత్రికలకు సమాజంపట్ల బాధ్యత లేదా ? అని ప్రశ్నించినప్పుడు మిగతా అన్ని ప్రక్రియలకన్న పత్రికలకే బాధ్యత ఎక్కువని చెపాల్సివస్తుంది. అక్షరాస్యులైన వాళ్ళల్లో పత్రికలు చదువకుండా రోజు వెళ్ళదీసేవారు బహు తక్కువ. దిన, వార, పక్ష, మాసపత్రికల్లో ఏదో ఒకటిగాని, ఇవన్నీగాని చదివేవారి సంఖ్య పెరిగింది. ప్రజలబారు సాహిత్యం అందజేస్తున్నందువల్ల ప్రజల్లో పాఠకుల సంఖ్యను పత్రికలు పెంచుతున్నాయిగాని పాఠకుల అభిరుచి స్థాయిని పెంచడానికి తగినంత కృషి చేయలేక పోతున్నాయి. ప్రజలకేం కావాలి అన్నది నిర్ధారించడంలో పత్రికలు నిత్యమూ అధ్యయనం చేయవలసిందే. ప్రజలకేం కావాలి అనే దృష్టితో ఆలోచించడమే కాకుండా ప్రజలకేమి అందించాలి అనే దృష్టితోకూడ ఆలోచించగలిగినప్పుడే పత్రికలు సమాజంపట్ల తమ బాధ్యతను నెరవేర్చుకున్నట్లవుతుంది. అంటే ఆలోచించినంత మాత్రాన చాలదు, ఆచరణలో పెట్టగలగాలి.

ఇటువంటి వ్యవహారాల్లోనే పత్రికారచయితలకు, పత్రికా నిర్వాహకులకు సమైక్యం పొసగదు. నిర్వాహకులకు సర్క్యులేషన్‌మీద, ఆదాయంమీద, దృష్టి ఉంటుంది. పత్రికా రచయితలకు తాము పాఠకులకు అందజేసే వస్తువుమీద దాని ఔచిత్యంమీద దృష్టి ఉంటుంది. నాలుగు పత్రికలుంటే ఆ నాలుగు పత్రికల మధ్య అలంకారంలో తేడా ఉండవచ్చుగాని ఆత్మలో తేడా ఉండవలసిన అవసరం లేదు. కాని ఇప్పుడు పత్రికలుకూడా ఒక వ్యాపార పథకాలుగా మారి పోవడంవల్ల అలంకారాల్లో తేడాయేకాకుండా పూర్తిగా ఆత్మల్ని మార్చడానికి వీలైతే పరకాయ ప్రవేశాలు చెయ్యడానికి తాపత్రయాలు పెచ్చరిల్లి ప్రజల్ని మర్చిపోతున్నాయంటే, ఆశ్చర్యపడనక్కరలేదు.

వార్తలు, వార్తల్ని ప్రతిపాదించే తీరు, ఆ వార్తల ప్రాముఖ్యాన్ని అవగాహన పరిచే కథనం ఒకవంక; బొమ్మలు ముద్రించడం ఒకవంక; రకరకాల చిరుతిండ్లలాగా రకరకాల శీర్షికలు పెట్టి వెరైటీ అందించడం ఒకవంక; తేలిక సాహిత్యాన్ని అందజేయడం ఒకవంక- ఇలా పాఠకుల్ని ఆకర్షించుకొనే అలంకరణలు పత్రికల్లో కనిపిస్తుంటాయి. కంటికింపైతేనే నోటికింపు అన్నట్లు ముందు స్వరూపం బాగుంటేనే స్వభావాన్ని గురించి తెలుసుకొనే ఆసక్తి జనిస్తుంది. పాఠకులనుంచి ఈ ఆసక్తిని సాధించుకోడానికి ఈ స్వరూపపాలంకరణతోనే సతమతమైపోయే పత్రికలు కొన్ని వుంటే, మన స్వభావం పాఠకులకు ఏనాటి నుంచో తెలుసుకదా అనే ధీమాతో స్వరూపం పట్ల అశ్రద్ధచేసే పత్రికలు కొన్ని కనిపిస్తున్నాయి. రంగులు, బొమ్మలు, హంగులు, తేలిక సాహిత్యం, పై పై మెరుగులవంటి వాటికే ప్రాధాన్యమివ్వడం ఎంత పాతకమో జనాన్ని విజ్ఞానవంతుల్ని చేసే లక్ష్యంతో నడవాల్సిన పత్రికలు అనాకర్షకంగా బైట పడడంకూడా అంత పాతకమే. మనిషి సెక్సీగా ఉండాలా మొరటుగా ఉండాలా అన్న ప్రశ్న వచ్చినపుడు సంసారపక్షంగా ఉండాలన్న బహుజనాభిప్రాయం వంటిదే పత్రికలు పై ఆకర్షణలతో పాఠకుల్ని ఆకర్షించుకోవాలా వస్తువైలక్షణ్యం ద్వారా ఆకట్టుకోవాలా అన్న ప్రశ్నకు రెండూ తగు పాళ్ళలో ఉండాలన్న జవాబు రావడం.

ఈనాడు పత్రికల సంఖ్య బహుళమైపోయింది. పాఠకుల స్తోమత పరిమితంగా ఉంది. ఈ పరిస్థితిలో పాఠకుల విచక్షణకు ఎక్కువ విలువ, ప్రయోజనం ఉంటుంది. బజారులో తోరణాల్లాగా వ్రేలాడుతూ కనిపించే అనేకానేక పత్రికల్లో ఏది మంచిది, ఏది సమాజాభ్యుదయాన్ని కాంక్షిస్తున్నది. ఏది వినోదంతో పాటు విషయపరిజ్ఞానాన్ని అందిస్తున్నది, ఏది సంతృప్తికరమైన సంస్కారముతో విషయాన్ని ప్రతిపాదిస్తున్నది, ఏది తను చెప్పగలిగిన విషయాల్ని కాక ప్రజలు తెలుసుకోవలసిన విషయాల్ని అందజేస్తున్నది, బేరీజువేసి తేల్చడం కష్టమే. ఎటువంటి పత్రికను పాఠకుడు ఎన్నుకోవాలి. అంటే ఇప్పుడు పేర్కొన్న ఐదు లక్షణాలనూ ప్రదర్శించగల పత్రికను ఎన్నుకోవాలి. కొందరు కొందరు కొన్నిరకాల పత్రికలకు అలవాటు పడిపోతారు. ఆ పత్రిక చదివితేనే తప్ప ఆరోజు వారికి సంతృప్తి ఉండదు. అయితే ఇలా ఎడిక్ట్ కావడం ఒక్కొక్కప్పుడు పాఠకుని బలహీనతవల్లనూ సంభవిస్తుంది; ఒక్కొక్కప్పుడు పత్రిక విశిష్టతవల్లనూ సంభవిస్తుంది. మరొక అంశంకూడా ఉంది. ఇలాంటి ఎడిక్ట్

అయిన పాఠకుల్ని సంపాదించుకోగలిగిన పత్రికకు నిజంగా ఒక వ్యక్తిత్వం ఉన్నట్లు లెక్క. ఫ్లోటింగ్ పాప్యులేషన్‌లాగా చాలా పత్రికలకు ఫ్లోటింగ్ సర్క్యులేషన్ ఉంటుంది. చెట్లులేనిచోట ఆముదము చెట్టే మహా వృక్షమనేరీతిలో పత్రికలు కొన్ని ఉంటాయి. వ్యాపార దక్షతవల్ల విస్తృత వ్యవస్థవల్ల పేరుకు వచ్చిన పత్రికలు కొన్ని ఉంటాయి. బాహ్యాకర్షణలవల్ల ప్రజల్లోకి చొచ్చుకు పోయిన పత్రికలు కొన్ని ఉంటాయి. లక్ష్యశుద్ధివల్ల అభిమానం సంపాదించుకున్న పత్రికలు కొన్ని ఉంటాయి. గతచరిత్రనుబట్టి నిర్వహించుకు వస్తున్న పత్రికలు కొన్ని ఉంటాయి. బజారులోకి వచ్చిన వ్యక్తి తన కాలక్షేపంకోసం ఏ పత్రిక దొరికితే ఆ పత్రిక కొనుక్కుపోవడం కద్దు. అలాగే బహుళమైన ప్రచారవ్యవస్థ ద్వారా పాఠకుడు ప్రలోభితుడు కావడం కద్దు. కాదు, నాకు ఫలానా పత్రికే కావాలనినిర్ధారించిచెప్పగల పాఠకులుండడంకూడా కద్దు. ఈ అన్నిరకాలపత్రికలూ ఈ అన్నిరకాల పాఠకుల్నీ ఆకర్షించుకుంటాయి. ఏరకం పాఠకుడు ఆరకం పత్రికను ఎన్నుకోవడం సహజం. అయితే, ఏదో ఒక పత్రికను చదివేపాఠకుల్ని సంపాదించుకోగలిగిన పత్రికకన్న తనకోసమే వేచి ఉండే పాఠకుల్ని సంపాదించుకో గలిగిన పత్రికకే సొంత వ్యక్తిత్వమున్నట్లు లెక్క.

పత్రికలకు రెండు రకాల రీడర్‌షిప్ లుంటాయి. కొన్ని పత్రికలకు పాప్యులర్ రీడర్‌షిప్ ఉంటుంది. అంటే, విస్తారంగా ఆ పత్రికను చదివే వారి సంఖ్య హెచ్చుగా ఉంటుంది. కొన్ని పత్రికలకు ఎఫెక్టివ్ రీడర్‌షిప్ ఉంటుంది. అంటే, ఆ పత్రికలోని అంశాలు ఎవరు తెలుసుకుంటే దాని వల్ల ప్రయోజనం ఉంటుందో వారు చదువుతూ ఉండడమన్నమాట. మొదటితరహా పత్రికలు ఎక్కువ మంది చదివేవే అయినప్పటికీ అవి సాధించగలదేమీ లేకపోవచ్చు. రెండో తరహా పత్రికలు స్వల్ప సంఖ్యలో చదవడం జరిగినప్పటికీ వాటిలోని అంశాలకు వెను వెంటనే ఫలితాలు సంభవించవచ్చు.

మామూలు మాటల్లో చెప్పుకోవాలంటే మాస్ పత్రికలు, క్లాస్ పత్రికలు అని వాటిని వ్యవహరించవచ్చు; మాస్ సినిమాలు, క్లాస్ సినిమాలు అన్నట్లే.

'కాకి నల్లగా ఉండును' అనేది సిద్ధాంతం, 'నల్లని వన్నీ కాకులు కావు' అనేది అపవాదం. మంచి సినిమాకు బాగా డబ్బు రావచ్చు గాని, బాగా డబ్బు ఆర్జించిన సినిమాలన్నీ మంచివి కాకపోవచ్చు. అపవాదం తీసుకుంటే మంచి

సినిమాలన్నీ బాగా డబ్బు ఆర్జించకచకపోవచ్చు. అలాగే మంచి ప్రత్రికకు సర్క్యు లేషన్ బాగా యుంటుందన్నది సిద్ధాంతం; బాగా సర్క్యులేషన్ ఉన్న ప్రతి పత్రికా మంచి పత్రిక కాకపోవచ్చుననేది అపవాదం. మంచి రూపంతో పాటు మంచి గుణమూ ఉంటుందన్నంత మాత్రాన రూపమున్న చోట గుణం విధిగా ఉండి తీరాలని లేదు.

కాని ప్రతి విషయంలోనూ జనాభిప్రాయమంటూ ఒకటి ఉంటుంది. అది మాత్రం నిర్దుష్టంగానే ఉంటుంది. పత్రికల విషయంలోనూ అంతే. పత్రిక బాగోగులు, మంచి చెడుల్ని గురించిన జనాభిప్రాయం పరివ్యాప్తం కాక తప్పదు. అభిరుచి, ఎన్నిక, అవకాశం, స్తోమత, విస్తృతి మొదలైన అంశాలవల్ల ఆ పరివ్యాప్త జనాభిప్రాయంలో మార్పు సంభవించదు. తాత్కాలికమైన ఆటు పోటులు- ఫ్లక్చుయేషన్స్- ఎలా ఉన్నప్పటికీ జనాభిప్రాయం మాత్రం పత్రికల స్థాయిని వ్యక్తిత్వాన్ని కూడా తెలియజెప్పగల శక్తి కలది.

ఈనాడు జీవితంలో అతిక్షణమూ వ్యాపారమై పోతున్నది. సంసారానుబంధాలు, మిత్రత్వాలు శత్రుత్వాలు, విద్య, ఉద్యోగాలు చివరకు రచనలు అన్నీ వ్యాపారాత్మకమై పోతున్నాయి. మనం ఇండస్ట్రియలైజేషన్ వైపు నడుస్తున్నామా కమర్షియలైజేషన్ వైపు నడుస్తున్నామా అనే సందేహం కలగడం సహజం. మనిషి జీవితంలో తెలిసీ తెలియని యౌవన దశ -అడొలెసెంట్ ఏజ్- ఎంత ప్రమాదకరమైనదో ప్రజాజీవితంలో ఈ కమర్షియలైజేషన్ దశ అంత ప్రమాదకరమైనది. మన కళలన్నీ ఈ ప్రమాదకర దశలోనే ఉన్నాయి కళల వల్ల సమిష్టి ప్రయోజన దృష్టి పోయి వ్యష్టి ప్రయోజన దృష్టి పెరుగుతున్న పరిస్థితుల మధ్య కళా రూపంలో ఒకటిగా భావించదగిన పత్రికా రచన కూడా రకరకాల ప్రభావాలకూ ప్రలోభాలకూ తలఒగ్గి నడవడం కాదనలేని పరిస్థితే అయినప్పటికీ ఔననవలసిన విషయం కాదు.

మనకు ఎలాంటి పత్రికలున్నాయో తెలుసు. ఎలాంటి పత్రికలు కావాలో మాత్రం తెలియడం లేదు. ఇది పాఠకుల పరిస్థితి.

మనం ప్రజలకు ఎలాంటి మేటరిస్తున్నామో తెలుసు;ఎలాంటి మేటరివ్వాలో కూడా తెలుసు. ఇది పత్రికల పరిస్థితి.

ఎలాంటి పత్రికలు కావాలో తెలియని పాఠకులపట్ల ఎలాంటి మేటరివ్వాలో తెలిసిన పత్రికలు తీర్చవలసిన బాధ్యతలున్నాయి. ఈ బాధ్యతలు తీరాలంటే కొంత త్యాగం అవసరం.

ఏమిటా త్యాగం ?

కమర్షియల్ దృక్పథాన్ని సాధ్యమైనంత తగ్గించుకోడం.

పత్రికను ప్రబోధ సాధనంగా కన్న ప్రచార సాధనంగా వినియోగించడమే ఒక మెట్టు దిగినట్లు. పత్రికను ప్రచార సాధనంగా కన్న వ్యాపార సాధనంగా వాడడం ఇంకా దిగిజార్పు. ఈ దిగజార్పును పాఠకులు గుర్తించగలగాలి. మొత్తం పత్రికలో జనసామాన్యం కోసం వినియోగించే స్థలం కన్న పత్రిక ఆదాయం కోసం వినియోగించే స్థలం ఎక్కువైనపుడు ఆ పత్రికకు జనసామాన్యం పట్ల వారి సంక్షేమంపట్ల శ్రద్ధాసక్తులు తగ్గినట్లే లెక్క. పత్రికలు అందించే మాటర్ విషయంలోకూడా పాఠకులు ఇలాగే బేరీజు వెయ్యాలి. అవి వార్తలే కానివ్వండి, సాహిత్యమే కానివ్వండి. ప్రజాప్రయోజన దృష్టితో నిష్పాక్షిక వైఖరితో ప్రచురణమవుతున్నదా లేక సంకుచిత ప్రయోజన దృష్టితో ప్రచురితమవుతున్నదాఅనిపాఠకులుపరిశీలనకావించగలిగిననాడు పత్రికలలో కమర్షియలైజేషన్ దానంతటది తగ్గుతుంది. తమకు అందించే సరుకును చదవడమే అలవాటు చేసుకున్న పాఠకులు తమకు కావలసిన సరుకును డిమాండు చెయ్యగల స్థాయికి ఎదిగినప్పుడే పత్రికలనుంచి సంపూర్ణ ఫలితాన్ని రాబట్టుకో గలుగుతారు. తమ పేరు పేపరులో చూసుకోవాలన్న తపనగల పాఠకులు, రచయితల వల్లనే చాలా పత్రికలు నడుస్తున్నాయని చెప్పడం సాహసమైతే కావచ్చుగాని సత్యదూరం మాత్రంకాదు. పాఠకుల్ని రచయితల్ని ఈ తపననుంచి సమాజ ప్రయోజన లక్ష్యం వైపు నడిపించగల పత్రికలు లేవని కాదుగాని, వాటిసంఖ్య ఇంకా పెరగాలి.

కొంత పరుషంగా ధ్వనించినాసరేగాని, విటుల్ని ఆకర్షించడానికి తాపత్రయ పడే వేశ్యల్లాగా మాత్రం పత్రికలు తయారుకారాదు. సూర్యుడంత వెలుగు నివ్వలేక పోయినా చంద్రుడంత చల్లదనం పంచలేక పోయినా ఉన్న చీకటిని కాస్త ప్రక్కకు నెట్టగల చిరుదీపంలాగానైనా ప్రతిపత్రిక తన పాఠకులకు బాధ్యత వహించి సేవచెయ్యాలి. పాఠకులు చైతన్యవంతులైన మరుక్షణం

నుంచీ పత్రికా పరిశ్రమకు వ్యాపార స్వభావం పోయి ప్రజాస్వభావం రూపు దిద్దుకుంటుంది.

ఇప్పటి పత్రికలు, వాటి స్వరూపస్వభావాలు, వాటిని నడిపించే ఆదర్శాలు స్పర్ధలు, కార్పణ్యాలు-ఇవన్నీ పాఠకుల్లో చైతన్యంకలగడానికే దారితీస్తున్నాయి.

ఇంటిని చూసి ఇల్లాలిని చూడన్నారు. నీ స్నేహితుల్నిబట్టి నువ్వేమిటో చెప్పవచ్చు. పత్రికల్నిబట్టి పాఠకులు, పాఠకుల్నిబట్టి పత్రికలు గౌరవం పొంద గల ఉన్నత ప్రమాణాల్ని అందుకోడానికే అనుక్షణం ప్రయత్నించాలనుకోడం ఉటోపియన్ ఆదర్శం మాత్రం కాబోదన్న నమ్మకంతో - ముగిస్తున్నాను.

—: o :—

# కవిత్వాధ్యయనం

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

కవిత్వాన్ని వ్రాయటం వేరు, చదవటం వేరు, అధ్యయనం చేయటం వేరు. అధ్యయన మంటే గ్రుడ్డిగా ఆరాధించటం కాదు. అసలైన తత్వాన్ని అన్వేషించటం. అన్వేషించటం మరలా రెండువిధాలు. ఒకటి- తాను కోరుకున్నది కవిత్వంలో ఉందా లేదా అని తరిచిచూడటం. రెండు- కవితలో ఉన్న పరమార్థాన్ని సమతతో చూడటం. మొదటిదాన్ని సాపేక్షాధ్యయన మనీ, రెండవదాన్ని నిరపేక్షాధ్యయన మనీ పిలవ్వచ్చు. సాపేక్షాధ్యయనం ప్రధానంగా సహృదయుని ప్రవృత్తిమీద ఆధారపడి ఉంటుంది. నిరపేక్షాధ్యయనం మౌలికంగా సహృదయుని సంస్కారం మీద ఆధారపడి ఉంటుంది. ప్రవృత్తి అంటే పరిత ఇష్టానిష్టాలవలన ఏర్పడిన అభిరుచి విశేషం. సంస్కార మంటే జన్మతః సహృదయునిలో ఉండే రసికత్వం.

అధ్యయనానికి ముందు మెట్టు ఆస్వాదనం. ఆస్వాదనాన్ని ఆధునికులు అనుభూతి అంటున్నారు. కవిత్వాన్ని మొదట సహృదయు డాస్వాదించాలి. తరువాత అధ్యయనం చేయాలి. ఆస్వాదనకు కావలిసింది కూడా సంస్కారమే. సంస్కారం వాసనారూపంగా ఉంటుందనీ, ఆ వాసనాబలంవల్ల సహృదయుడు కవిత్వంలోని రసభావాల నాస్వాదింపగలుగుతాడనీ, వాసనలేని వాడు పాషాణ తుల్యుడనీ అభినవగుప్తుడు చెప్పాడు. పాశ్చాత్యులు వాసనాసిద్ధాంతాన్ని భావించక పోయినా సహృదయునికి సాహిత్యరసికత్వం- లేక- సహృదయత్వం ఉండాలని అంగీకరించారు. దీన్ని సాహిత్యాభిరుచి అనకూడదా అని ఒక ప్రశ్న రావచ్చు. ఆ సమాసంలో అభిరుచి అనే పదానికి సహృదయత్వ మనే అర్థం. అయితే మనం ఇంతకుపూర్వం అనుకున్న అభిరుచివిశేషమైన ప్రవృత్తి ఇంతకంటే భిన్న మైందని గ్రహించాలి. ఒకరికి ఒక వస్తు వంటే మక్కువ ఉండవచ్చు. ఒక సిద్ధాంత మంటే అభిమాన ముండవచ్చు. అటువంటప్పుడు అతడు తనకు

నచ్చినదాన్నే ఆస్వాదింప గలుగుతాడు. అంటే అతడు కొన్ని ఆవరణాలకు లోబడినా డన్నమాట. కొన్ని ఇష్టానిష్టాలకు బద్ధుడైనా డన్నమాట. మరి అటు వంటివాళ్లు కవిత్వాన్ని ఆస్వాదించలేరా? అని మరొక ప్రశ్న పుడుతుంది నిజానికి కొందరికి కవిత్వమే కిట్ట దనుకోండి. వారికి కవిత్వం వినిపించి ప్రయోజన మేంటి? వారికి రక్తికి బదులు విరక్తే కలుగుతుంది. మరికొందరికి కవిత్వమంటే ఇష్టమే. కాని, కవిత్వంలో తా ననుకున్న దృక్పథమే ఉండా లని భావించా రనుకోండి. వారికి వారి భావాని కనుగుణంగా వ్రాసిన కవిత్వమే ఆస్వాదనీయం కావచ్చు. మరొకమాటలో చెప్పాలంటే లోకంలో కొందరు కవిత్వానికీ తమకూ మధ్య తామే అడ్డం నిలబడుతున్నా రన్నమాట. అటువంటివారిని నూటికి నూరు పాళ్లు సహృదయు లంటానికి వీల్లేదు.

కవిత్వాన్ని ఆస్వాదించటానికి పఠిత తనంతట తాను అడ్డం నిలిచే ప్రవృత్తిని తొలగించుకోవాలి. అంటే తన్మయత్వాన్ని పొందే చిత్తవృత్తిని అల వరచుకోవాలి. దీన్నే లాక్షణికభాషలో విశ్వజనీనత్వం అంటారు. పరగతసుఖ దుఃఖాలను తనవిగా భావించి తన్మయు డయ్యే అవస్థ అది. అప్పుడు పఠితలో ఆత్మప్రత్యయం ఉండదు. విశ్వజనీనుడైన ఆత్మగా భాసిస్తాడు. ఇతరుల అవస్థలో లీన మౌతాడు. అంటే తన్ను తాను మరిచిపోతాడు. అనుభూతిలో తన్మయుడౌతాడు. ఆనందాన్ని అనుభవిస్తాడు. దీన్నే లాక్షణికభాషలో చెపితే రసానంద మంటారు. కవిత్వం ప్రధానంగా రసానందంకోసమే పుటుతుంది. అనుభూతిలో నుంచి ఆకృతి గాంచి అనుభూతిలో లయమై పోతుంది. అస లీ అనుభూతిని అంగీకరించకపోతే కవితాత్మను కాదన్నట్లే. కవితను చదివేవాడు మొదట అనుభూతికోసమే చదువుతాడు. నిరపేక్షాధ్యయనానికి ఈ అనుభవ మార్గం ప్రాతిపదిక.

ఇక సాపేక్షమార్గాన్ని గురించి ఆలోచిద్దాం. ఆధునికుల్లో అభ్యుదయ వాదులు-విప్లవవాదులు ఉన్నారు. వీరు కవితను మార్క్సుదృక్పథంతో చూస్తారు. ఆ దృక్పథంతో వ్రాసిన కవిత కవిత్వమంటారు. తదితరమైంది కవిత అయినా దాన్ని గణనకు తీసుకోరు. ఇందులో మరో విశేష ముంది. కవిత్వంలో వస్తువు ఉంటుంది, ప్రక్రియ ఉంటుంది, అనుభవం ఉంటుంది. వస్తువు ఏదైనా, ప్రక్రియ ఏదైనా, ఆ రెండూ అనుభవానికి సాధకాలే. సాధ్యమైన అనుభూతిని అందుకోవ టానికి అభ్యుదయకవిత ఒక సాధనం. అయితే ఆ సాధనస్వరూప స్వభావా లెలా

గుండాలి అన్న అభిప్రాయంలో అభ్యుదయవాదులకు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయా లున్నాయి. సమాజంలోని కుళ్లును వెలికితీసి విమర్శించటం, సామ్యవాద దృక్పథంతో వస్తువు నెన్నుకొని చిత్రించటం, వీలైనంతవరకు సంప్రదాయంగా తాము భావించే ఛందస్సును నియమాలను పరిత్యజించటం మొదలైనవి వారి అభిప్రాయాలు. పద్యంలో కవిత వ్రాస్తే చే దని కాదు. సీతారాములశోకం విష మని కాదు కాని, అవి తమ సిద్ధాంతాలకు పతాకలుగా నిలవ్వు. అందువల్ల ఆ వస్తువులో, ప్రక్రియలో వారిచిత్తం రమించదు. అది వారిప్రవృత్తి. అభ్యుదయ కవిత్వంలోనూ, ప్రాచీనసాహిత్యంలోనూ పక్షపాతం లేని సహృదయభావంతో రసాస్వాదనం చేసే రసికు డున్నా డనుకుందాం. వా డేజాతికి చెందుతాడో- ఎవ రెలా అనుకున్నా- సహృదయజాతి వాడిది. అలా సహృదయుడు కాలేకపోతే కవిత్వాన్ని రెండుకన్నులతో చూడలేడు. సమచిత్తంతో ఆస్వాదించలేడు.

ఆధునికులు ఆస్వాదనను రెండు విధాలుగా వింగడిస్తున్నారు. ఒకటి : హృదయంతో ఆస్వాదించటం. రెండు : మేధతో ఆస్వాదించటం. ఆస్వాదన లోని అనుభూతి- తన్మయత్వం కాదు. తత్ప్రభావం కవిత చదివితే పఠిత కన్నీరు కార్చటం కాదు ప్రధానం. కవితలోని భావంతో సానుభూతి ప్రకటించటం -లేదా-కవిత ప్రతిపాదించే బావంతో ప్రభావితుడు కావటం. సామాజికుల్లో సానుభూతి కలగాలని కవితలో అభివ్యక్తి శిల్పాన్ని బలంగా వాడుకుంటున్నాడు ఆధునిక కవి. పఠితను ప్రభావితుణ్ణి చేయాలని సిద్ధాంతాలను శంఖంలా పూరిస్తున్నాడు. అభివ్యక్తి శిల్పంలో రచనాచమత్కారం రాణిస్తోంది; సిద్ధాంత కవిత్వంలో సూత్రాలూ భాష్యాలూ వినిపిస్తున్నాయి. కవిత్వాన్ని కళగా కంటె ప్రచార సాధనంగా ఉపయోగించుకొనే రాజకీయ చైతన్యం ప్రపంచంలో ప్రబలిం తర్వాత వచ్చిన పరిణామాల్లో పరిగణింపదగింది ఇది. దీనికి యాంత్రిక యుగ వాతావరణం తోడయింది. ఎలెక్ట్రానిక్ బ్రెయిన్ ఆలోచిస్తుంది తప్ప అనుభ వించదు. యాంత్రిక నాగరికత మెదడుమీద పనిచేసినంతగా గుండెమీద పని చేయదు. దీనికి రాజకీయ ఆర్థిక దృక్పథాలు తోడైతే ఇక చెప్పాలా? ఎండకు వడగాలి తోడైనట్లు, రాజకీయ ప్రయోజనాలకు వెలువడే సిద్ధాంతాలకు రాజ్యాలు లక్ష్యాలు: కవితలు మంత్రాంగాలు. ఇక ఆర్థిక సమానత్వాన్ని బోధించటానికి కవిత ప్రబోధసాధనం, ప్రచార ఆయుధం. ప్రబోధంలో బీదలబాధల కరుణా మయ చిత్రాలు కన్నీరు కార్పించి దాని కన్న సానుభూతిని కలిగిస్తాయి. ప్రచార

కవిత్వంలో ప్రణాళికలే పదివేల అవతారా లెత్తుతాయి. ఏమైనా అధునికుడు కవిత్వాన్ని ఆర్ద్రంగా సృష్టించటం లేదు; ఆర్ద్రంగా అనుభవించటం లేదు. ఆవేశంతో రచిస్తున్నాడు, ఆవేగాన్ని అభివ్యక్తం చేస్తున్నాడు. ఈ రెండూ పఠితలో ఆలోచనరేకెత్తించాలంటున్నాడు ఆధునిక యుగం కవితను ఆరాధించటం లేదు; అనుభవించటం లేదు; ఆయుధంగా ఉపయోగించు కొంటోంది. ఆ ఆయుధం చాలవరకు తుపాకీ. ఆ తుపాకీ గుండెలమీద పేలదు; మెదళ్లమీద పేలుతుంది. అందులోని ప్రేలుడు మందు సిద్ధాంతం. మరోపేరు దానికి-ఇజం. ఇజం మెదడును పలుపుకట్టి ముందుకు లాక్కెళ్లుతుంది. హృదయం లేగలా దాని వెంట పరుగెడుతుంది.

అనుభూతి లేనిది అధ్యయనం లేదనుకున్నామే. మరి అనుభూతి అంటే సహానుభూతి కాదు, సానుభూతి అనుకున్నా తాదాత్మ్యభావం గాదు- తత్ప్రభావ మనుకున్నా ఆర్ద్రత కాదు ఆవేశ మనుకున్నా; ఆనందం కాదు ఆలోచన అనుకున్నా. అది లేంది అధ్యయనం లేదు. అయితే, మనసుతో పొందే అనుభూతి లోచూపు ప్రసరింప చేస్తుంది; మెదడుతో పొందే అనుభూతి పైచూపు నిస్తుంది. తనలో విశ్వాన్ని చూచుకొనేది లోచూపు.విశ్వాత్మలోతనను చూచుకొనేది పైచూపు. ఏ చూపుతోనైనా అన్వేషణ ప్రారంభించవచ్చు. అధ్యయనం సాగించవచ్చు.

అయితే కవితకు అధ్యయనం అవసరమా ? అని కొందరు సూటిగా ప్రశ్నించవచ్చు. వనితను కోరేవాడికి వయసుంటే చాలు వలపెందు కన్నట్లుంటుంది ఈ ప్రశ్న. అధ్యయనం కవితలు వ్రాయటానికి తోడ్పడుతుంది. తిరుపతి వేంకట కవు లన్నట్లు-

'చదువగావలె శబ్దశాస్త్రాదికమ్ములను
        వీక్షింపగా వలె విద్య లెల్లఁ
జూడగావలె రాజ చూడామణుల సభల్
        పొందగా వలె మహా భోగములును
దిరుగగావలె దేశదేశాల వెంబడిఁ
        బడవలెఁ బడరాని పాటు లెల్ల
వినగా వలెను పూర్వ విద్వచ్చరిత్రముల్
        దర్శింపవలెను ఛందఃప్రశంస

కవులు కవు లన్న మాత్రన కవులు గారు
ఎంతబారమ్ము గలదొ కవీశ్వరులకు
నెఱుఁగకుంమరె మీవంటి నృపతిమణులు
శ్రీసదానంద గజపతి క్షితితలేంద్ర!'

ఇంత వ్యుత్పత్తిని సంపాదించి దానిసారాన్ని ప్రతిభామయం చేసి కవిత్వంగా తీర్చిదిద్దాలి. వ్రాయటాని కింత అధ్యయనం కావలిసివస్తే ఇక ఆ కవిత్వాన్ని అవగాహనం చేసుకోవటానికి అధ్యయనం అవసరం లేదా?

మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూగు
రాయంచ సనునె తరంగిణులకు
లలిత రసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక
మరుగునే సాంద్రనీహారములకు
అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు?
వినుతగుణశీల మాటలు వేయు నేల?

పోతనగారి పద్యం చదివితే పాముపాట విన్నట్టుగా తల లూపే తెలుగువా రున్నారు-కోట్లకు పైబడి. కాని, ఆ కోట్లలో ఏ లక్షకో దాన్ని తెలిసి తలలూపే శక్తి ఉండవచ్చు. సామగానంలా విన వచ్చే శబ్దమాధుర్యం వేరు-సోమపానంలా కనవచ్చే దాని భక్తి భావం వేరు. పద్యభావం తెలిస్తే కాని భక్తిభావం అర్థం కాదు. అందువల్లనే ప్రాచీను లన్నారు.

సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం
ఏకమాపాతమధుర మన్యదాలోచనామృతం.

సాహిత్యంలో అనుభూతి ఆలోచనవల్ల వస్తుంది. ఆలోచనం అర్హతవల్ల వస్తుంది. అర్హత అంటే విద్యార్హత కాదు; అధ్యయనశక్తి. అధ్యయనమంటే విద్యార్థులు ప్రతిపదార్థ తాత్పర్యం, ప్రకృతి వికృతులూ, సంధి సూత్రాలూ అని భయపడి

పోతారు. ప్రాచీన లక్షణ గ్రంథాలూ, సాహిత్య మర్మాలూ, సమాసాలూ, శబ్ద కోశాలూ, శాస్త్రవ్యుత్పత్తులూ-ఇవ్వేమో ననుకుని ఈసడించుకుంటారు అభ్యుదయ కవులు. కాని, ఆధునిక కవిత్వం అర్థం కావాలన్నా-అంతో యింతో అధ్యయనం కావాలని వారే అంటారు. "ఆధునికాంధ్ర కవుల రచనలను సరిగా అర్థం చేసుకోవడానికి వాటి వెనుక బాసటగా నిలిచిన ఇతర దేశాల సాహిత్య వ్యవసాయాలను గమనించక తప్పదు. నేటి రచనలను విశ్వపర్యాప్తమైన విశాల జీవితంతో సమన్వయించి నిజమైన కవిత్వ మేదో, కేవలం నిర్జీవ శుష్కానుకరణ మేదో గుర్తించాలి" అని శ్రీశ్రీ అన్నాడు.

ఏ దేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం.

ఈ చరణాలకు ప్రతిపదార్థ తాత్పర్యం అవసరంలేదు. ప్రతిపాదితార్థ తత్వం తెలియాలి. గతి భౌతిక తార్కికవాద దృక్పథం తెలిస్తే గేయంలోని భావం తేటపడుతుంది. కవితను ఆస్వాదించాలంటే అర్థం అవసరం. అర్థం పదార్థమే కాదు. అంతకంటె కవితలో చెప్పే పరమార్థం. అధ్యయనం శబ్దార్థాలకు సంబంధించింది కాదు. శాస్త్రార్థానికి సంబంధించింది తాత్పర్య జ్ఞానమే కాదు; తత్త్వచింతనం.

అధ్యయనం అనుభూతి కైన అన్వేషణం కావచ్చు; అనుభూతి విశ్లేణం కావచ్చు. కవిత్వంలో రమణీయ మైన భావం ఉంటుంది. కాని, అది చదవంగానే వెంటనే సామాన్య పఠితకు స్ఫురింపకపోవచ్చు. కొంచెం విడమరిచి చెపితే అతడు దాన్ని ఆస్వాదింప గలుగుతాడు.

స్వైర విహారధీర లగు సారసలోచన లున్న చోటికిన్
భోరున లాతివారు చొరఁబూనినచో రసభంగ మంచు నేఁ
జేరక పువ్వుఁ దీవియల చెంతనె నిల్చి లతాంగి రూపు క
న్నారఁగఁ జూచి వచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పెదన్.

ఇందులో 'సారసలోచన' అనే సమాసంలో 'రస' భంగమైతే 'సాలోచనలు' అనే పదం ఏర్పడుతుం దన్న చమత్కారం తెలిస్తే సహృదయుడు సంతోషపడతాడు. దానికి కొంత పరిశ్రమ తప్పదు. అందువల్ల అనుభూతికై అన్వేషణ చేయటంలో పఠితకు గురువూ, మిత్రుడూ, వ్యాఖ్యానం, విమర్శా తోడుపడుతుంటాయి.

ఇక అనుభూతి విశ్లేషణం గూర్చి విచారిద్దాం. ఒక కవిత చదివితే ఒక అనుభూతి కలుగుతుంది. ఆ అనుభూతి ఎలా కలుగుతుంది ? దానికి తోడు

పడుతున్న కవితాద్రవ్యా లేమిటి ? అవి ఎలా ఆ అనుభూతిని కలిగిస్తాయి ? మొదలైన ప్రశ్నలు వివేకవంతునికి కలుగుతాయి. వాటికి సమాధానం తనంతట తాను చెప్పుకొనే స్థితిలో ఉంటే సహృదయుడు ధన్యుడే. అది అంత తేలికైన పని కాదు. రుచి చూడటం తేలికే గాని, ఆ రుచి ఎలా ఏర్పడుతుందో వివేచించటం అంత తేలిగ్గాదు. ఇలా వివేచించే పద్ధతినే ప్రపంచంలో కావ్య సౌందర్య దర్శన శాస్త్ర మంటారు. అలంకార శాస్త్రమంటే ఆధునికులకు ఆగ్రహం గాని పేరు మార్చుకున్నా ప్రయోజనం మాత్రం ఒకటే. సౌందర్య స్వరూపస్వభావాలు కవి కెంత తెలియాలో పఠితకూ అంతే తెలిసి ఉండాలి.

'యెనకజల్మంలోన యేవరమో నంటి
సీ గ్గొచ్చి నవ్వింది సిలక నా యెంకి
ముందు మన కేజల్మ ముందోలె యంటి
తెల్లతెల బోయింది పిల్ల నాయెంకి
ఎన్నాళ్లు మనకోలె యీ సుకము లంటి
కంట నీ రెట్టింది జంట నా యెంకి:'

ఈ పాట వింటే కమ్మగా ఉంటుంది. దానిలో కమ్మదనాన్ని కలిగించే అంశాల నన్వేషిస్తే అనంతంగా ఉంది. పునర్జన్మ సిద్ధాంతం నుంచి పల్లెవారి మన స్తత్వం వరకూ ఎన్నో విషయాలు తెలియాలి. తెలియకపోతే ఏమౌతుం దంటే మన మనస్సును మనమే దివాలా చేసుకుంటాము. అంతదూరం వద్దు. జీవితాన్ని ప్రకృతినీ ఒకచోట ముచ్చటగా ముడివేసి మనముందు కవితను ఒక కవి ఉంచా డను కోండి. ఉదా॥ విశ్వనాథవారి చిన్ని మబ్బులు.

'కన్నె కాటుక కళ్లు-చిన్ని నాథుని చూచి
కదలు లాడిన వేళ-కందళించిన వేళ
ఆకాశమధ్యాన-అట నొక్క తెలిమబ్బు
మెరపులా మెరిసిందిలే-వెలుగులో వొరిసిందిలే.'
'తొలిచిన్ని చూలాలు-కొలసిగ్గు ప్రేమతో
విభుని చూచిన వేళ-విన్నబోయిన వేళ
బఱువు మిన్నులలోన-ఒక నీలి తెరమబ్బు
సంజతో తారిందిలే-జాలుగా మారిందిలే'.

'తాళికాన్ని పసిపాప-సాక నేరని చాల
తెలవోయి పతి జూచి-కళవళించిన వేళ
తూరుపూకోనలో- తొంగలించినమ్మబ్బు
తెగ పరువు లెత్తిందిలే సొగసుల్లు పోయిందిరె'

ఈ కన్నె జీవితానికిన్నీ- ఆ కన్నె మబ్బులకూన్నూ ఉన్న సంబంధం సౌందర్య దృష్టి, సంస్కార శక్తి ఉంటేనే గాని అవగతం కాదు. సౌందర్యం ప్రతి వాడినీ సంతోషపెడుతుంది. మరి ఎవడికో గాని దాని తత్వం బోధపడదు.

'చావు పుట్టుకల మధ్య సందేహం లాంటి
జీవితంలో నలువైపులా అంధకారం
మంచిగంధంలాగా పరిమళించే మానవత్వం
మా కున్న ఒకే ఒక అలంకారం!'

అన్న తిలక్ కవిత భావనారమణీయంగా ఉంటుంది. కాని 'చావు పుట్టుకల మధ్య సందేహంలాంటి' అన్న ఉపమానాన్ని అందుకోవటానికి ఉపజ్ఞతో పాటు ఊహా బలం కూడా ఉండాలి. శ్రీశ్రీ గారి అవతారాన్ని చదివితే కలిగే అనుభూతిని విశ్లేషించుకోవటానికి ఎంత పిండి ఉండాలి ?

'యముని మహిషపు లోహ ఘంటలు
మబ్బుచాటున- ఖణేల్ మన్నాయి
నరకలోకపు జాగిలమ్ములు
గొలుసు త్రెంచుకు ఉరికిపడ్డాయి.........
పుడమితల్లికి పురుటి నొప్పులు
కొత్త సృష్టిని స్ఫురింపించాయి.'

అనుభూతికై అన్వేషణ మనిషిలోని రసికత్వానికి చిహ్నం! అనుభూతి విశ్లేషణ మనిషిలోని జిజ్ఞాసకు ప్రతిబింబం! ఈ రెండు అధ్యయనానికి రెండు రెక్కలు, బొమ్మ బొరుసూ. ఏ యుగంలో కవిత అయినా అధ్యయనం లేకపోతే అంత రించి పోతుంది.

ప్రాచీన కవితను అధ్యయనం చేయాలంటే పాండిత్యముండాలి. ఆధునిక కవితను అధ్యయనం చేయాలంటే సామాజిక స్పృహ ఉండాలి. ప్రాచీన గ్రంథాల్లో కొన్ని రసప్రధానాలూ, జీవితంలోని చైతన్యాన్ని గాఢంగా చిత్రించిన కావ్యాలూ ఉన్నాయి. మరికొన్ని ప్రతి పద్య శిల్పమని పేరుపెట్టి ప్రతిభా

వ్యుత్పత్తులను పండించి పాండిత్య శౌండీర్యాన్ని ప్రబంధ రచనలో ప్రదర్శించి నవీ ఉన్నాయి. ప్రాచీన సాహిత్యం జీవిత పరమార్థాన్ని చిత్రించినంతగా జీవిత గాథను చిత్రించలేదు. సమకాలీనేతివృత్తం సర్వథా పరిత్యాజ్యంగా ఉండేది. అందువల్ల కవి పురాణకథలో ప్రచ్ఛన్నంగా తననాటి వాతావరణాన్ని ప్రదర్శిస్తుండేవాడు. అయినా అతని దృష్టి కథమీదా, సమాజ వ్యథమీదా కాదు ఉంది. బోధన మీదా పద్యంలోని శిల్ప శోధన మీదా ప్రధానంగా ప్రసారమయ్యేది. వారికి భిన్నంగా ఆధునికులు చెప్పుకోదగ్గ నవ్యతను సాధించారు. సాహిత్యం సమాజానికి ప్రతిబింబంగా ఉండాలనీ, సామాజిక చైతన్యానికి సాధకంగా ఉండాలనీ వారు భావిస్తారు. సమాజ వ్యవస్థను సామ్యవాద దృక్పథంతో సమీక్షించి వర్గ సంఘర్షణను విప్లవం ద్వారా వారించి సమ సమాజాన్ని నిర్మించాలన్న స్పృహను కవితలో వస్తువులో కళాత్మకంగా సాధిస్తున్నారు. ఈనాటి సాహిత్యం మనం బతుకుతున్న సమాజానికి సమీక్ష. అయితే, ఆధునికుల్లో కొందరు జీవితంలోని ఆర్థిక రాజకీయ సమస్యలకే ప్రాధాన్యమిచ్చి అదే జీవిత మంటున్నారు. ఆర్థికంగా అభివృద్ధి చెందినా జాతి ఆధ్యాత్మికంగా అభివృద్ధి కాకపోతే వికాసం సంపూర్ణం కాదు. తిండీబట్టా అందరికీ దొరికినా జీవిత గమ్యం తెలియక పోతే జాతి పురోగతికి లక్ష్యం లేకుండా పోతుంది. బతుక్కు వైశాల్యం ఏర్పడ వచ్చును గాని లోతు ఏర్పడదు. సామాజిక స్పృహ సామాజికావహనవల్లనే ఏర్పడుతుంది. ఆధ్యాత్మిక స్పృహ జీవిత తత్వాన్ని దర్శించటంవల్ల యేర్పడుతుంది. ఆ అవగాహనకు గూడా అధ్యయనం కావాలి. చైతన్యం చింతనం వలన వస్తుంది. అధ్యయనం అవగాహన వలన ఏర్పడుతుంది,

వచనకవులు కొందరు కవితను ప్రజావాణిగా పలికిస్తున్నారు. సామాన్యుని కందుబాటులో ఉండేటట్లు సారళ్యంతో వచనకవిత వెలయించటం వీరి ఆశయం. కవితకు సారళ్యం రావాలంటే ప్రౌఢ మైన ప్రాచీనకవిత్వం చదవ్వద్దని యువ తరానికి బోధిస్తున్నారు వీరు. పాండిత్యం పరిశ్రమకు సంబంధించినది. ప్రౌఢి వేరు పాండిత్యం వేరు. తేటతెలుగులో కవిత చెప్పినా ప్రౌఢంగా చెప్పటం నేర్పు. వచనకవులు సమాసాలను చూచి భయపడతారు. సంప్రదాయ మంటే సానుభూతి చూపరు. వస్తువులో సమాజం, గుణంలో సారళ్యం, ప్రక్రియలో వచనం వారి త్రిశరణాలు. సమాజంకోసం కవిత వ్రాస్తున్నప్పుడు దానికి సారళ్యం ప్రధాన

ధర్మంగా ఉండాలి. అసలు ఆంధ్రసాహిత్యచరిత్ర నొక్కసారి సమీక్షిసే సార వంతమైన రచనకూ, సరళమైన రచనకూ పోటాపోటీలు సాగివస్తూ ఉన్నాయి. ఒకదాని తరువాత మరొకటి చక్రారపంక్తిలా తిరుగుతూనే ఉన్నాయి. నన్నయ మార్గకవిత్వం తరువాత శివకవుల జానుతెనుగు కవిత్వం, తిక్కన తెలుగు కవిత్వం తరువాత శ్రీనాథుని ప్రౌఢసాహిత్యం, పోతన భక్తికవిత్వం తరువాత ప్రబంధాల ఆలంకారికకవిత్వం, పదకవుల భక్తిగీతాల వెనుక శ్లేషబంధ నిర్జీవ కవిత్వం, తిరుపతివేంకటకవుల ఆశుకవిత్వం తరువాత భావకవుల శిల్పకవిత్వం, భావకవుల పద్యకవిత్వం తరువాత శ్రీశ్రీ గేయకవిత్వం, ఆతరువాత వచన కవుల సరళకవిత్వం— ఇలా ఈవర్గసంఘర్షణ సాగివస్తూదే ఉంది. చమత్కార మేమంటే పద్యగేయాలు వ్రాసేవారు వచనకవులకు పాలితవర్గం వంటివారు. వారు స్వయంగా పీడితవర్గంలా బాధపడతారు. సాహిత్యరంగంలో కూడా వర్గ భేదాన్ని పాటిస్తారు అభ్యుదయవాదులు. అదేవారికి ఆయుస్సూత్రం. విప్లవం వస్తుందో రాదో విస్సన్న కెరుక గాని, సాహిత్యసహృదయభావంలో మాత్రం సమైక్యత లేకుండా పోతోంది.

వచన కవిత అయితేనేం, ప్రాచీనకవిత అయితేనేం, అరస కవిత్వ మైతేనేం విరస కవిత్వ మైతేనేం- కవిత్వాన్ని అధ్యయనం చేయకపోతే అది కటాక్షించటం కల్ల ! వచన కవిత్వానికికూడా కొంత నియతి ఉండాలి. అది రచయిత, సామాజికుడు తెలిసి సృజించాలి, సమర్థించాలి అని శ్రీ కుందుర్తిగారు భావిస్తూండడం అధ్యయనాన్ని ఆహ్వానించటమే ! అధ్యయనమే అభ్యుదయానికి చిహ్నం. అభ్యుదయ మనే మాటకు అర్థాన్ని తెలుసుకోవాలన్నా, అభ్యుదయ వాదంలోని అంతరార్థాన్ని తెలుసుకోవాలన్నా అధ్యయనం చేయాలి. అధ్యయనం చేయాలి. అధ్యయనానికి అరలు లేవు పొరలు లేవు- సీమలు లేవు కామాలు లేవు- నిషేధాలు లేవు నిందలు లేవు- పద్య మనీ లేదు గద్య మనీ లేదు ! కళ్లకు గంతలు కడితే సాగదు అధ్యయనం. నిగ్గు తేల్చటమే నిజమైన అధ్యయనం ! నిజం చెప్పటమే నిలిచే అధ్యయనం. కవితలోని లోతును, ఎత్తును దర్శించేది అధ్యయనం ! మనిషిలోని మమతను, మనీషిని చూపించేది అధ్యయనం !

కవితకు అధ్యయనం సమతకు సందర్శనం !
కవితకు అధ్యయనం నవతకు అభ్యుదయం !

—: o :—

# నందిని




## మీ ఆత్మీయులతో ఆనందం పంచుకోండి
## ఒక్క రూపాయికే నందిని నందుకోండి

కేవలం ఒక్క రూపాయితో - భారత దేశంలో మీ ఆత్మీయులు ఎక్కడున్నాసరే - సంవత్సరం పాటు వాళ్ళు మిమ్మల్ని గుర్తుంచుకునేలా - మీ ఆత్మీయతకు కొత్త అనుబంధాన్ని పెనవేస్తూ - యువభారతిని వారికి పరిచయం చేసినందుకు మిమ్మల్ని అభినందించేలా చేస్తూ - పన్నెండు నెలలూ మీ ఆత్మీయుల్ని పలకరిస్తుంది 'నందిని' అటు అందుకున్నవారికి ఆనందాన్నీ, ఇటు అందిస్తున్న మీకు సంతృప్తినీ సమానంగా పంచిపెడ్తుంది- 'నందిని'

**మీరు ఎన్నైనా రూపాయలు పంపవచ్చు**

**అన్ని చిరునామాలూ పంపాలని గుర్తుంచుకోండి!**

ఉత్తర ప్రత్యుత్తరాలకు -

**యువభారతి**

5 కింగ్స్‌వే, సికిందరాబాదు, 500003

స్వయంగా వచ్చి కలవదలిస్తే : యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనాలు,
తిలక్ రోడ్డు, హైదరాబాదు, 500001

చుట్టూరా
ఆవరించుకునివున్న చీకటిని
తిట్టుకుంటూ కూర్చోవడంకంటె
ప్రయత్నించి
ఎంత చిన్నదీపాన్నయినా



వెలిగించడం మంచిది
అన్నవాక్యమే మా యువభారతికి ఊపిరి